ఓమ్

సరస్వత్యై నమః

హరిః ఓమ్

ఆర్ష విజ్ఞాన పరిషత్తు

# ఉపనిషత్సుధ

మొదటి యంజలి భాగము-1

ఈశావాస్య కేన కఠ ప్రశ్నోపనిషత్తులు

మూల తాత్పర్య పద్యానువాద సహితము



చర్ల గణపతిశాస్త్రి

# ఉపక్రమణిక

మన భారతీయ విజ్ఞానమున కంతకు మూలము వేదములు. శబ్దా కారమును బొందిన జ్ఞానములె వేదములు. వేదములను శ్రుతు లనియు నందురు. పరమేశ్వరుని నిశ్వసితము లగు వేదములు సమాధ్యవస్థ యందు ఋషులచే శ్రుతము అగుటవలన శ్రుతు లనియుఁ బిలువఁ బడెను. ఈ శ్రుతిమంత్రములను దర్శించిన ఋషులు మంత్రద్రష్టలని పిలువఁ బడిరి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము అని వేదములు నాలుగు. ప్రతి వేదము విషయమును బట్టి సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అని విభజి పబడెను. వేదములను పై విధముగ విభజించిన మహర్షి బాద రాయణుఁడు. వేదములను విడఁదీయుటచే వేదవ్యాసుఁడు (వేదములను విడదీసినవాఁడు) అని యతనికిఁ బేరు గలిగెను. ఈ వేదముల చివరి భాగములు ఉపనిషత్తులు. ఇవి వేదముల చివర ఉండుటవలన వీనికి వేదాంతము లనియు, శ్రుతిశిరస్సు లనియుఁ బేరు గలిగినది. ఉపనిషత్తు లనఁగా అవిద్యను, అజ్ఞానమును నశింపఁజేయునవి.

ఈ యుపనిషత్తులు సర్వశిరోధార్యములై మహోదాత్తములై పరమేశ్వరతత్త్వబోధకములై యున్నవి. ఇవి వేదశాఖలనుబట్టి (౧౧౮౦) పదునొకండువందల యెనుబది. ఋగ్వేదమునకు (౨౧) ఇరువదియొక్క శాఖలు, యజుర్వేదమునకు (౧౦౯) నూట తొమ్మిది, సామవేదమునకు (౧౦౦౦) వేయి, అథర్వణవేదమునకు (౫౦) ఏబది శాఖలు. మొత్తము ౧౧౮౦ పదునొకండు వందల యెనుబది శాఖలు. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క ఉపనిషత్తు గలదు. అందు సారతరమైనవి నూటయెనిమిది. నూట యెనిమిదింటిలో ముఖ్యమైన పండ్రెండు ఉపనిషత్తులకు శ్రీశంకర భగవత్పాదులు భాష్యము రచించిరి. శ్రీవిద్యారణ్యాచార్యులు ఈనూట యెనిమిది యుపనిషత్తులకు భాష్యము రచించిరి. అందు వేదములు

కర్మకాండస్వరూపమైన సంసారప్రవృత్తి ధర్మమును, ఉపనిషత్తులు మోక్షస్వరూపమైన సంసారనివృత్తి ధర్మములను బోధించును. ఇంకను విస్తరింపకముగ విద్యల వివరమిటఁ దెలిసికొనుట యావశ్యకము గాన వాని వివరము ఇటఁ దెలుపఁబడుచున్నది.

ప్రవృత్తి నివృత్తి రూపధర్మములను బోధించు విద్యలు పదు నాలుగు. 1 ఋగ్వేదము, 2 యజుర్వేదము, 3 సామవేదము, 4 అథ ర్వణవేదము, 5 శిక్ష, 6 కల్పము, 7 వ్యాకరణము, 8 నిరుక్తము, 9 ఛందస్సు, 10 జ్యోతిషము, 11 పురాణములు, 12 న్యాయము, 13 మీమాంస, 14 ధర్మశాస్త్రములు. మొదటి నాలుగింటిని వేదము లందురు. పిమ్మటి యారును వేదాంగములు. ఉపపురాణములును పురాణములలోనివే, వైశేషిక దర్శనము న్యాయశాస్త్రములోనిదే. వేదాంతము మీమాంసలోనిదే. మహాభారత, రామాయణ సాంఖ్య పాతంజల పాశుపత వైష్ణవములు ధర్మశాస్త్రముల లోనివే. ఇవి యన్నియు సాక్షాత్తుగాఁ గాని పరంపరగాఁ గాని భగవంతునినె తెలు పును. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వ వేదము, అర్థశాస్త్రము అను నీ యుపవేదములు వేదాంతర్గతములే. ఇవియన్నియుఁ బరమేశ్వ రుని యస్తిత్వప్రతిపాదకములు గాన వీనిని ఆస్తిక దర్శనము లందురు.

దేవుఁడు లేఁడు అని చెప్పువారి నాస్తికదర్శనములు భిన్నభిన్న ములుగా నున్నవి. "సర్వము శూన్యము" అని మాధ్యమికులును, "సర్వ విజ్ఞానములు క్షణికములు" అని యోగాచారులును, "ఆయావస్తువుల జ్ఞానములను బట్టి బాహ్యవస్తువు లున్నవని యూహింపఁ బడుచున్నది గాని యవి క్షణికములు" అని సౌత్రాంతికులును, "బాహ్యవస్తువులు గనిపించుచున్నవి గావున ఉన్నవి, అవి నశించుచున్నవి గాన క్షణికములు" అని వైభాషికులును, "దేహము ఆత్మయు నొకటే, ఆత్మ వేఱుగ లేదు" అని చార్వాకులును, "దేహ మెంత పరిణామము గలదో అంతే పరి

మాణముగలది యాత్మ" యని దిగంబరులును అనేక విధములుగాఁ జెప్పిరి. అవి వేదబాహ్యము లగుటయేకాక పురుషార్థములకు ఉపయోగింపవు కాన అవి యాదరింపఁ దగినవి గావు.

"అసుర్యా నామ తే లోకా, అంధేన తమసాఽఽవృతాః
తాంస్తే ప్రేత్యాఽభిగచ్ఛంతి, యే కే చాత్మహనో జనాః"

అనియు ఆత్మను నిరసించు పైవారి మతమును ఈశావాస్యోపనిషత్తులోని (సూ. తాత్పర్యము, ఈశ, 3) మూఁడవమంత్రము నిరసించుచున్నది.

మఱి వేదములు పౌరుషేయములా అపౌరుషేయములా యను విషయమును గూర్చి యిచ్చట వారివారి యాశయములను దెలిపెదను. "చతుర్ముఖుని హృదయంబున ఓంకారనాదము వ్యక్తమయ్యెను. ఆ ప్రణవనాద సహాయముచే బ్రహ్మ తన నాలుగు ముఖంబులనుండి నాలుగు వేదములను కలుగఁజేసెను" అని వేదములు మానవులనుండి గాక బ్రహ్మ ముఖమునుండి పుట్టినట్లు భాగవతాది పురాణములు చెప్పుచున్నవి.

"స్వయంభూ రేష భగవాన్, వేదో గీతః స్వయంభువా
శివాద్యా ఋషి పర్యంతాః, స్మర్తారోఽస్య న కారకాః"

భగవంతుఁడు తనకుఁ దానే పుట్టినవాఁడు అనఁగా జన్మ లేనివాఁడు. ఆస్వయంభువుచేత వేదము గానము చేయఁబడినది. శివుఁడు మొదలుగా ఋషులందఱు వేదమును స్మరించినవారే గాని కర్తలు గారు అని శాస్త్రములును వేదమునకు అపౌరుషేయత్వమునే యుద్ఘాటించుచున్నవి. "పైప్పలాదము, కాలాపము, కాఠకము, జనకుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, గార్గి, మైత్రేయి మొదలగు పురుషనామములు వేదములందుఁ గనిపించుటచేతను, ఆపురుషులు జననమరణములు గల

వారు గాన వారినిగూర్చి చెప్పబడిన శ్రుతులును అనిత్యపురుష నిర్మితములని చెప్పఁదగియుండుటచేతను వేదములు పౌరుషేయములే గాని యపౌరుషేయములుగావు" అని శంకించుకొని "శబ్దము నిత్యము. ఆ శబ్దరాశియగు వేదమును జదివిన దర్శించిన యాయా మనుల నామధేయములను బట్టి ఆయా వేదభాగములకు పైప్పలాదాది నామములు గలిగెను. మఱి జనకుఁడు, యాజ్ఞవల్క్యుఁడు మొదలగు పేర్లు తండ్రి మొదలగు నర్థములను బోధించు వ్యుత్పన్నపదములే గాని తత్తత్పురుషనామధేయములు గావని సమాధానము చెప్పి పూర్వమీమాంసయందు జైమిని మహర్షి వేదములు అపౌరుషేయములే యని సిద్ధాంతీకరించెను. మఱియు జ్ఞానమును బోధించుటకు ఆఖ్యాయికారూపముగా ఆయాపేర్లు పెట్టి శ్రుతి చెప్పెనేగాని యవి జనన మరణ సహిత మానవ నామధేయములు గావనియు బుధులు చెప్పుదురు. "ధాతా—యథాపూర్వ మకల్పయత్" "బ్రహ్మ పూర్వమువలెనే సూర్యచంద్రాదులను సృజించెను" "యథర్తా వృతులింగాని నానా రూపాణి పర్యయే, దృశ్యంతే తాని తాన్యేవ యథా భావా యుగాదిషు", "ఋతువులు మాఱునపుడు పూర్వ ఋతుచిహ్నము లగు పువ్వులు కాయలు వర్షములు ఎండ చలి మొదలగునవి తిరుగ తిరుగ వచ్చినవే వచ్చుచు నెట్లు గనిపించుచున్నవో యట్లే యుగయుగమందును ఆప్రపంచభావములే తిరుగ తిరుగ కలుగుచుండును" అని చెప్పి, వేదములను బూర్వ పూర్వ యుగము లందున్నవే తరువాత యుగములందును ఆనాదిగా వ్యక్తము లగుచుండునని శాస్త్రములు దెలుపుచున్నవి. ఇట్లు వేదములు అపౌరుషేయములని ప్రాచీన శాస్త్రములు తెలుపుచున్నవి.

ఇంక వేదములందుఁ బ్రతిపాదింపఁబడిన విషయమును గూర్చి కొలఁదిగఁ దెలిసికొందము. నివృత్తిరూపమైన మోక్ష సాధమును ఎక్కుటకుఁ బ్రవృత్తిరూపమైన ధర్మము, ధర్మముతో గూడిన

యర్థకామములు మొదటి సోపానములై ఆవశ్యకములై యున్నవి. నివృత్తి యనగా సంసారమునందలి కోరికలనుండి మనసును ముక్తిపై మరలించుట. ప్రవృత్తి యనఁగా సంసారమందె యుండి ధర్మయుక్తములగు సత్కర్మ లాచరించుట. స్వస్వధర్మములను ఆశ్రమ ధర్మములను యథావిధిగఁ బాటించుచు నింద్రియ నిగ్రహము గల వాఁడై మనుష్యుఁడు క్రమక్రమముగా మోక్షసాధమును జేరవలసి యున్నది. అందు చే జ్ఞానమునకు సహకారులగు కర్మలు చేయవలయునని వేదములు చెప్పుచున్నవి. "త్రైగుణ్యవిషయా వేదాః" "సత్త్వరజ స్తమో రూపగుణములకు సంబంధించిన విషయములు గలవి వేదములు" అనియు గీత చెప్పుచున్నది.

వేదోక్తకర్మలు ఏదో యొక కోరికతోఁ జేయఁబడునవిగాన అవి కామ్యకర్మ లనఁబడును. ఆ కామ్యకర్మలను జేయునపుడు మనుజుఁడు ఫలాభిలాషియై యుండును. ఫలము ననుసరించి సుఖదుఃఖాది ద్వంద్వ ములకు వశుఁడై పాపపుణ్యాది బద్ధుఁడు గావలసి వచ్చును. అట్టి పాప పుణ్యాది బంధము నుండి ముక్తుఁడగుటకు నిష్కామరూప మగు మోక్షమునే పరమావధిగా గ్రహింపవలెనని యుపనిషత్తులు ఘోష చేయుచున్నవి.

అట్టి పరమ ప్రయోజనమగు మోక్షమును బొందుటకుఁ దన స్వరూపమును ఆనందరూపమగు పరమేశ్వరు స్వరూపమును ఆత్మ తత్త్వమును తెలిసికొనవలసి యున్నది. ఇవి యన్నియు నొకటే కాని భిన్నములు గావు. ప్రహ్లాదాది భక్తులు నామరూపాది సహితమును సగుణము నగు పరమేశ్వర రూపమును దర్శించినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఉపనిషత్తులు నిర్గుణరూపమునే ప్రధానముగ బోధిం చుచు సగుణోపాసన ద్వారా నిర్గుణోపాసన చేయవలయునని చెప్పు చున్నవి. మానవులు తప్పక కర్మలు చేయుచునే జీవింపవలయు

ననియు నిర్గుణబ్రహ్మమును దనస్వరూపమును బొందుటకు గర్మలు సహకారు లనియు నందు దెలుపఁ బడెను. సగుణరూపము నారాధించువారు ఆయా లోకములను జేరి గాని యీ లోకమందేగాని క్రమముగా నాత్మజ్ఞానము పొంది ముక్తిని బొందవలయునని నిరూపించినవి.

పురుషుఁడు ఆత్మ బ్రహ్మము మొదలగు పదములు పరమేశ్వరునికిఁ బర్యాయ పదములుగ ఉపనిషత్తులలో వాడఁబడినవి. పురుషుడనఁగా హృదయమను పురమున శయనించు వాఁడు. ఆత్మ యనఁగా అంతట వ్యాపించినది. బ్రహ్మము అనఁగా బృహత్స్వరూపము గలది. ఈ నామముల వ్యుత్పత్త్యర్థములను బట్టియు ఉపనిషత్తులందును, గీతాలందును బోధింపఁబడిన దానినిబట్టియుఁ జూడఁ బరమేశ్వరుఁడు నామరూపాదులు లేనివాఁడును నామరూపాద్యతీత మహాచైతన్య శక్తియనియుఁ దెలియుచున్నది "నేనీ యోగశాస్త్రమును పూర్వము సూర్యునికిఁ జెప్పితిని, సూర్యుఁడు మనువునకుఁ జెప్పెను" ఇత్యాది గీతా సూక్తులనుబట్టి శ్రీకృష్ణుఁడు తాను భౌతికదేహయుతుఁడు గాక నామరూపాద్యతీత శక్తిస్వరూపుఁడని మనము గ్రహింపవలయును. కనుకనే యీయోగశాస్త్రము భగవద్గీతయైనది. అయితే నామరూపాదులు లేని బహ్మమునుండి నామరూపాదులు గలిగి భిన్నభిన్న రూపములుగల ప్రపంచ మెట్లుగలిగెనని ప్రశ్న యుదయించుచున్నది. ఈప్రశ్న శ్వేతకేతువు తండ్రియైన యుద్దాలకుని అడుగఁగా అతఁడు "ఒక మఱ్ఱిపండు తెమ్మని, దానిని జీల్చి యందును సూక్ష్మమముగా నున్న యొక మఱ్ఱిగింజను జీల్చి యందేమి యున్నదో చూచి చెప్పుమనెను" శ్వేతకేతువు ఆమఱ్ఱిగింజను జీల్చి యందేమి లేదనెను. అట్లు ఏమియు లేని సూక్ష్మమునుండి యంత పెద్ద మఱ్ఱిచెట్టు ఏవిధముగా బయలుదేఱునో యట్లే నామరూపాదులు లేని బ్రహ్మమునుండి నామరూపాదులు గల యీ ప్రపంచము

(ఛాందోగ్య ౧ ౭-౧-౩) గలుగునని చెప్పెను. పరమేశ్వరుడు నామ రూపాదులు లేనివాఁడు గనుకనే సర్వవ్యాపకుఁడును అనంతశక్తి యుక్తుఁడును అయి యున్నాడు. బ్రహ్మము సర్వవ్యాపక మైనదని ఉద్దాలకుఁడు కుమారుఁడగు శ్వేతకేతువునకు చెప్పఁదలఁచి "నీటిలో ఉప్పుగడ్డను గలుపుమని యానీటిని పైని లోపల మధ్య అంతట రుచి చూచి యెట్లున్నదో చెప్పు" మనెను. అప్పుడు శ్వేతకేతువు నీరు అంతటను ఉప్పనగా నున్నదనెను. అప్పుడు నీటిలోఁ గలిసిపోయిన ఉప్పుగడ్డవలె ప్రపంచస్వరూపముగా మాఱిన చైతన్య స్వరూపుడగు పరమేశ్వరుఁడు అంతటను నిండి నామరూపాది రహితుఁడై చైతన్య మయుఁడై సర్వవ్యాపియై యుండెనని చెప్పెను.

అట్టి పరమేశ్వరునితో నైక్యమొందుటకును శాశ్వతానందమును బొందుటకును సాధనములు ఉపనిషత్తులలోనే చెప్పఁబడెను. ధన పుత్రాది వ్యామోహము గలవారీపరమేశ్వరునిఁ గాంచలేరని యందే యుద్ఘోషింపఁబడినది.

"న సాంపరాయః ప్రతిభాతి బాలం
ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం"

"ధనవ్యామోహముచేఁ బ్రమాదపడువాని కీమోక్ష పదము ప్రతిభాసింపదు."

"నాఽయ మాత్మా ప్రవచనేన లభ్యో
న బహునాశ్రుతేన యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం"

"ఈయాత్మ వేదాధ్యయనముచేతఁగాని బుద్ధిచేతఁగాని కేవల బహుశాస్త్ర జ్ఞానముచేతఁగాని లభింపదు. ఈయాత్మను అన్నివిధముల దర్శింపఁగోరువాఁడె దీనిని బొందును. వానికే యీయాత్మ తనరూప మును వివరించును."

నాఽవిరతో దుశ్చరితా న్నాఽశాంతో నాఽసమాహితః
నాఽశాంతమనసో వాపి, ప్రజ్ఞానేనైన మాప్నుయాత్"

దుష్ప్రవర్తననుండి మరలనివాఁడును, శాంతిలేనివాఁడును, నిశ్చలత్వము లేనివాఁడును, చంచలబుద్ధియును దీనిని బొందలేడు. ఆత్మజ్ఞానముచేతనే దీనిని బొందును.

"నవిత్తేన తర్పణీయో మనుష్యః"
"మానవుఁడు ధనముచేఁ దృప్తిఁబొందువాఁడు కాఁడు."

అని యీవిధముగా శ్రుతులు మనోవాక్కాయ కర్మలలో పవిత్రత శాంతి యున్నఁ గాని ధనాది వ్యామోహములను వీడినఁగాని యీపరమానందమగు బ్రహ్మస్వరూపమును గాంచలేఁడని తెలుపుచున్నవి.

కాని శాశ్వతానంద స్వరూపమైన బ్రహ్మముతో నైక్యము పొందుటకు సోపానములగు ధర్మమును ధర్మముతోఁ గూడిన యర్థ కామములను యథావిధిగ నాచరించుచు ఉపనిషత్తులలో బోధింపఁ బడిన బ్రహ్మమును గాంచి క్రమముగా నిష్కాములై ఆప్తకాములై జనులు పరమపురుషార్థమును నిత్యాను నగు బ్రహ్మానందమును బొందుదురు గాక.

విజ్ఞానపరిషత్తు
వాల్తేరు.

ఇట్లు
చర్ల గణపతిశాస్త్రి.

శ్రుతులు రస సముద్రింబులు
శ్రుతులన్ మథియించునట్టి సురలు మహర్షుల్
శ్రుతింబడిన దుపనిషత్సుధ
సతతం బది గ్రోలువారె సత్యానందుల్

నిత్య మనంత మనాద్యము
శ్రుత్యంత జ్ఞేయ మఖిల లోకాశ్రయమున్
సత్యస్వరూప మవ్యయ
మత్యంతానందతత్త్వ మనయముఁ గొలుతున్.

తొలి నారాయణుఁ డాత్మ రూపమున నెందున్ క్షీరమట్లొప్పి లీ
లలకై పాలమీఁగడ యట్టుల్ వ్యక్తాకృతిన్ బొంది, ని
ర్మలమాకాశము, నందు గాలి, జ్వలనం బొప్పై, నటన్ నీరు నం
దిల, యన్నంబయి జీవియై వెలుఁగు నా యీశున్ సదా మ్రొక్కెదన్.

శ్రీనారాయణబుధు వి
జ్ఞానధురీణుని ననేకశాస్త్రజ్ఞుఁ గవీ
శానుని జనకు గురుఁ దలఁచి
జాను తెనుఁగునందు నుపనిషత్సుధఁ గూర్తున్.

వివిధకృతులఁ బత్ని సుశీల, విమల కమల
చర్ల బుద్ధనారాయణశాస్త్రి విదుల
మృదుల యను నాసుతులు నాంధ్రితెలుఁగఁ దెనుఁగు
సలిపితిని చర్ల గణపతిశాస్త్రి నేను

వాజసనేయసంహితోపనిషత్
వా
ఈశావాస్యోపనిషత్
(శుక్లయజుర్వేదాంతర్గతా)
ఓమ్
శాంతిమంత్రః

పూర్ణ మదః పూర్ణ మిదం, పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మే వావశిష్యతే.

ఆ బ్రహ్మ మంతట వ్యాపించినది. నామరూపసహితమైన యీ జగమును అంతట వ్యాపించినదె. ఆ పూర్ణమైన బ్రహ్మమునుండి పూర్ణమైన జగము బయలుదేరుచున్నది. జగమునకు పూర్ణత్వమును గలిగించి యీపూర్ణమైన బ్రహ్మమె మిగిలియున్నది.

ఓమ్
శాంతి శ్శాంతి శ్శాంతిః

---

ఓమ్

ఈశావాస్య మిదంసర్వం, యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః, మాగృధః కస్య స్విద్ధనం. ౧

జగతియందు మార్పుచెందు నిది యంతయుఁ బరమేశ్వరునిచే నిండి యుండెను. దానిని త్యాగముచే నిన్ను రక్షించుకొనుము. దేనిని గోరకుము. ఇది యెవరి ధనము?

కుర్వ న్నేవేహ కర్మాణి, జిజీవిషే చ్ఛతం సమాః
ఏవం త్వయి నాన్యథేతో௨స్తి, న కర్మ లిప్యతే నరే. ౨

ఈ లోకమందు కర్మలు చేయుచునే నూరుసంవత్సరములు జీవింపఁ గోరవలయును. మఱియొక మార్గము లేదు. ఇట్లు జీవింపఁ గోరు నరుఁడవయిన నీకు అశుభకర్మములు అంటుకొనవు.

# వాజసనేయ సంహితోపనిషత్తు
లేక
# ఈశావాస్యోపనిషత్తు
(శుక్లయజుర్వేదములోనిది)

ఓమ్

## శాంతి మంత్రము

కం. పూర్ణము బ్రహ్మము జగ మిది
పూర్ణము; మాపూర్ణమునుండి పూర్ణము వెడలెన్
పూర్ణం బగు నీజగతికిఁ
బూర్ణత్వము గూర్చి యింకఁ బూర్ణమె మిగులున్.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

---

ఓమ్

కం. భగవంతుఁడు భువి మాఱుచు
నగపడు నీప్రతిపదార్థమందును నుండెన్
తగ నది త్యాగము చే నిపు
డె గాచికొను; కోరకు; మిది యెవరి ధనంబో. ౧

సంస్కృతమున "ఈశావాస్య" అని మొదలు పెట్టఁబడుటచే ఈశావాస్యోపనిషత్తు అని పేరు వచ్చెను. అవిద్యను అజ్ఞానమును నశింపఁ జేయునది గాన ఉపనిషత్తు అని వ్యుత్పత్తి.

కం. ధరఁ గర్మలు చేయుచునే
నిరతము నూఱేండ్లు బ్రతుక నెంచఁగ వలయున్
మఱొకగతి లేదు నీ కిఁక
నరసీ యిటులు చేయఁ గర్మ లంటవు నరునిన్. ౨

కర్మలు=అగ్నిహోత్రాది కర్మలని పూర్వులు, స్వస్వభావోచిత కర్మలని నవీనులు.

అసుర్యా నామ తే లోకాః, అంధేన తమసా వృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి, యే కే చాత్మహనో జనాః. 3

అజ్ఞానాంధకారముతో నావరింపఁబడిన యసుర్యము లనులోకములు గలవు. ఆత్మను నిరసించు జనులు చనిపోయిన పిదప ఆలోకములను పొందుదురు. కట్టెలు, బొగ్గులు, వత్తికంటె వేఱుగా అగ్ని యున్నట్లు దేహములకంటె వేఱుగా ఆత్మ యున్నది. అది లేదని నిరసించువారు స్థావరాదులైన యాసురజన్మలను బొందుదురని భావము.

అనేజ దేకం మనసో జవీయో, నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్
తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్, తస్మిన్నపో మాతరిశ్వాదధాతి. ర

ఆత్మ కదలదు, ఒకటె. మనసుకంటె వేగము గలది. దీనిని దేవులు = (ఇంద్రియములు) సమీపింపలేరు. అది ముందుగానే పోవును. అది కదలనిదై పరువెత్తికొనిపోవునట్టి యితరేంద్రియములను అతిక్రమించి పోవును. ఆ యాత్మ యున్నపుడు వాయువు ప్రాణులకు ఆయా చేష్టాదిశక్తులను విభజించుచున్నది. ఆత్మపదమునకు వ్యుత్పత్తి యీ విధముగాఁ జెప్పబడినది.

"యచ్చాప్నోతి య దాదత్తే, యచ్చాత్తి విషయా నిహ
య చ్చాస్య సంతతో భావ, స్తస్మా దాత్మేతి కీర్త్యతే"

"అన్నిటిని వ్యాపించునది, అన్నిటిని దనయందు లయింపఁ జేయునది, విషయముల ననుభవించునది, త్రాటియందుఁ బాముగుణ ములువలె దీనియందు ప్రపంచరూపము లారోపింపఁబడునుగాన "ఆత్మ" అని వ్యుత్పత్తి.

తే. గీ. కల వసుర్యంబు లనెడిలోకములు గొన్ని
నిరత మజ్ఞానతిమిరబంధురము లవ్వి
అజ్ఞులై యాత్మ నిరసించు నట్టిజనులు
పోదు రాలోకములు చనిపోవు పిదప. 3

లోకములు=చూడఁబడునవి అనఁగా అనుభవింపఁబడునవి జన్మ లని శంకరులు. అసు=ప్రాణములందు, ర=క్రీడించువారు, అసురులు=విషయంబులందు ఆసక్తిగలవారు, వీరు పొందు లోకములు=అసుర్య లోకములు అనఁగా స్థావరతిర్యగాది జన్మలని భావము.

మధు. మొదల దొకటె యాత్మము, కాని మించు మనోజవంబు
గదియ లేరు దేవులు దాని; కాని ముందదియె పోవు
అది కదలకయె పరువెత్తు నన్నింటిఁ దాటిపోవు
అదియె యుండఁగ వాయువు ప్రాణుల పనులు దిద్దు. 4

దేవులు=ద్యోతనస్వభావముగల నేత్రాది జ్ఞానేంద్రియములని శంకరులు. ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాపియు నామరూపాదులు లేనిదియుఁ గాన కదలకయె యన్నింటిని దాటి యుండునని భావము.

త దేజతి తన్నైజతి, తద్దూరే తద్వ దంతి కే
తదంత రస్య సర్వస్య, తదు సర్వ స్యాస్య బాహ్యతః. ౫

ఆయాత్మ కదలును, అది కదలదు, అది దూరముగ నున్నది. అట్లే దగ్గరగ నున్నది. అది యీ సర్వప్రపంచము యొక్క లోపల నున్నది. అది యీ సర్వప్రపంచముయొక్క వెలుపలను ఉన్నది.

యస్తు సర్వాణి భూతాని, ఆత్మ న్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం, తతో న విజుగుప్సతే. ౬

ఎవఁడు సర్వప్రాణులను ఆత్మయందే చూచునో, అన్నిప్రాణులందు ఆత్మను జూచునో వాఁడు అట్లు చూచుటవల్ల ఇతరులను ఏవగించుకొనఁడు.

యస్మిన్ సర్వాణి భూతాని, ఆత్మైవాభూ ద్విజానతః
తత్ర కో మోహః కః శోక, ఏకత్వ మనుపశ్యతః. ౭

ఎప్పుడు తెలిసినవానికి సర్వభూతములు ఆత్మగనే యయ్యెనో అప్పుడు అన్నిచోట్ల ఏకత్వమును జూచువానికి మోహ మేది? శోక మేది?

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరం శుద్ధ మపాప విద్ధం
కవి ర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ౮

ఆ యాత్మ అంతట వ్యాపించినది. శుద్ధమైనది, కాంతిమయమైనది, శరీరము లేనిది, నరములు లేనిది, పాపము లేనిది, అన్నిటిని జూచునది, మనస్సునకుఁ బ్రభువైనది. అన్నిటిపైని నున్నది, తనకుఁ దానె పుట్టినది. అది తగినట్లు సర్వపదార్థములను శాశ్వత సంవత్సరముల వఱకుండునట్లు గావించెను.

కం. అది కదలును మఱి కదలదు
అదెవరి కందనిది గాని యందఱ కందున్
అది యన్నిటిలోపలఁ గల
దది యన్నిటి బయటఁ గూడ నగపడుచుండున్. ౫

ఆత్మ యాకాశమువలెఁ గదలనిదైనను గదలుచున్నట్లు గనిపించును. దానిని బొందఁ గోరినవారి కందును. కోరనివారి కందదని భావము.

తే. గీ. ఆత్మ జ్యోతియందె యఖిలభూతంబులు
అఖిలభూతములను నాత్మ జ్యోతి
నరసి వానియందు నైక్య మొందుటవల్ల
నీతఁ డెవని నేవగించుకొనఁడు. ౬

ఆ. వె. జ్ఞానియౌ నరునకు సర్వభూతంబులు
నాత్మజ్యోతి రూపమైన యపుడు
అన్ని యెడల నైక్య మరసెడువానికిఁ
జూడ మోహ మేది శోక మేది. ౭

మధు. ఆత్మ యఖిలజగద్వ్యాప్త మమలంబు ద్యుతిమయంబు
ఆత్మ కొడలు నాడులు లేవు వ్యాధి పాపమ్ము లంట
వాత్మ సర్వద్రష్ట, మనీషి యఖిలస్రష్టయు స్వయంభు
వాత్మ తీర్చె శాశ్వత ముండునటు లన్ని యుక్తరీతి. ౮

అగ్నికి బొగ్గు, కట్టెలు, వత్తి లేనట్లు ఆత్మకు ఒడలు, నాడులు మొదలైనవి లేవు. ఎట్లు అగ్ని యొకజ్యోతియో అట్లే ఆత్మయుఁ దేజస్సే, బొగ్గు మొదలైనవి అగ్నిని బైకిఁ గనిపింపఁ జేయునట్లు ఒడలు ఆత్మను బైకిఁ గనిపింపఁ జేయును. కాన బొగ్గు మొదలైనవి ఆఱిపోయినను అగ్ని ఆఱనట్లు ఒడలు పోయినను ఆత్మ నశింపదని భావము.

అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యా ముపాసతే
తతో భూయ ఇవ తే, తమో య ఉ విద్యాయాం రతాః ౯

ఎవరు అవిద్యను=(కర్మను) ఉపాసింతురో వారు అజ్ఞానాంధకారమునఁ బ్రవేశింతురు. ఎవరు విద్యయందె=(దేవతోపాసనయందె) ఆసక్తులై యుందురో వారంతకంటె ఎక్కువ అజ్ఞానాంధకారమునఁ బ్రవేశింతురు.

అన్య దేవాహు ర్విద్యయా, అన్య దాహు రవిద్యయా
ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్విచచక్షిరే. ౧౦

విద్యచేత ఒక విధమైన ఫలమును అవిద్యచే మఱియొక విధమైన ఫలమును గలుగునని పండితులనిరి. ఎవరు మాకు ఆకర్మను జ్ఞానమును వివరించి చెప్పిరో యట్టిధీరులనుండి యిది వింటిమి.

విద్యాం చాఽవిద్యాంచ, య స్తద్వే దోభయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్య యాఽమృత మశ్నుతే. ౧౧

విద్యను అవిద్యను రెండింటిని గూడ నేమనుష్యుఁడు తెలిసికొనునో వాఁడు అవిద్యచే మృత్యువును=(స్వాభావికమైన కర్మను జ్ఞానమును) దాఁటి విద్యచే అమృతమును=(దేవతాస్వరూపమును) బొందును.

అంధం తమః ప్రవిశంతి యేఽ, సంభూతి ముపాసతే
తతో భూయ ఇవతే తమో, య ఉ సంభూత్యాం రతాః ౧౨

ఎవరు నామరూపాదులు లేని బ్రహ్మమును ఉపాసింతురో వారు అజ్ఞానాంధకారమును ప్రవేశింతురు. ఎవరు నామరూపాదులుగల బ్రహ్మమునందు ఆసక్తులై యుందురో వారింకను అధికమైన యజ్ఞానాంధకారమును బ్రవేశింతురు.

కం. నిరతము కర్మనె గొలిచెడు
నరుఁ డజ్ఞానాంధకార నరకమునఁ బడున్
నిరతము విద్యనె గోరెడు
నరుఁ డింక మహాంధకార నరకమునఁ బడున్. ౯

విద్యను=దేవతోపాసనను అని పూర్వులు. కర్మను=జ్ఞానరహిత కేవల కర్మను, విద్యను=ఆచరణరహిత కేవల విద్యను అని నవీనులు.

తే. గీ. ఒక్కకర్మనె గొలిచిన నొకఫలంబు
ఒక్కవిద్యనె గొలిచిన నింకొకఫలంబు
ప్రాప్త మగు నని ప్రాజ్ఞులు పలుకుచుంద్రు
పెద్దలు వచింప దీనిని వింటి మేము. ౧౦

"కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః" (కేవల కర్మోపాసనచేఁ బితృలోకమును కేవలదేవతోపాసనచే దేవలోకము గలుగును అని శ్రుతి.

తే. గీ. కర్మములను విద్యను గూడఁ గలిపి రెండు
తేట తెల్లముగ నెవండు తెలిసికొనునో
వాఁడు కర్మచేతను మృత్యుపదము దాఁటి
పిదప విద్యచే నమృతంపుఁ బదము నొందు. ౧౧

మృత్యుపదమును=విద్యకుఁ బ్రతిబంధకమైన స్వాభావిక పుణ్యపాపాది కర్మను, దానికి సంబంధించిన జ్ఞానమును, అమృతపదము=దేవతాత్మ భావమును.

కం. నిరతంబు ప్రకృతిఁ గొలిచెడు
నరుఁ డజ్ఞానాంధకార నరకమునఁ బడున్
నిరతంబు వికృతిఁ గొలిచెడు
నరుఁ డింక మహాంధకార నరకమునఁ బడున్. ౧౨

ప్రకృతిని=నామరూపాదులు లేని బ్రహ్మమును, వికృతిని=నామరూపాదులుగల బ్రహ్మమును, దీనినే హిరణ్యగర్భుఁడనియు నందురు.

అన్య దేవాహుః సంభవా, దన్య దాహు రసంభవాత్
ఇతి శుశ్రుమ ధీరాణాం, యే న స్తద్విచచక్షిరే. ౧౩

నామరూపాదులు గల బ్రహ్మమువల్ల ఒకవిధమైన ఫలమును నామరూపాదులు లేని బ్రహ్మమువల్ల మఱియొకవిధమైన ఫలమును గలుగునని పెద్దలు చెప్పిరి. ఎవరు మాకు వానిని గూర్చి వివరించి చెప్పిరో యా పండితులవల్ల విని వింటిమి.

అసంభూతిం చ వినాశం చ, య స్తద్వేదోభయం సహ
వినాశేన మృత్యుం తీర్త్వా, ఽసంభూత్యాఽమృత మశ్నుతే. ౧౪

నామరూపాదులు లేని బ్రహ్మమును, నామరూపాదులు గల బ్రహ్మమును గూడ నెవఁడు తెలిసికొనునో వాఁడు నామరూపాదిసహిత బ్రహ్మముచే మృత్యువును నామరూపాదిరహిత బ్రహ్మముచే అమృతమును బొందును.

హిరణ్మయేన పాత్రేణ, సత్యస్యాఽపిహితం ముఖం
తత్త్వం పూష న్నపావృణు, సత్యధర్మాయ దృష్టయే. ౧౫

బంగారుపాత్రిచేత సత్యముయొక్క (సూర్యమండలమందలి బ్రహ్మముయొక్క) ముఖము గప్పఁబడియున్నది. ఓపోషకుఁడగు సూర్యుఁడా! సత్యమె ధర్మము గల నాకొఱకు సత్యదృష్టికొఱకు ఆ పాత్రియొక్క యావరణమును తొలగింపుము.

పూష న్నేకర్షే! యమ! సూర్య!,
ప్రాజాపత్య! వ్యూహ రశ్మీన్ సమూహ
తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే
పశ్యామి యోఽసా వసౌ పురుషః సోఽహ మస్మి. ౧౬

ఓపోషకుఁడా! యొంటివై తిరుగువాఁడా! అన్నిటిని నియమించువాఁడా! సూర్యుఁడా! ప్రజాపతితనయా! నీ కిరణములను ఉపసంహరింపుము. నీతేజస్సును ఏకము చేయుము. మిక్కిలి శుభమైన నీరూపమును చూతును. ఈ నీలో నున్న పురుషుఁడను నేనే.

తే. గీ. ఒకటి ప్రకృతినె గొలిచిన నొక్క ఫలము
ఒక్క వికృతినె గొలువ నింకొక్క ఫలము
ప్రాప్త మగు నని ప్రాజ్ఞులు పలుకుచుండ్రు
పెద్దలు వచింప దీని వింటి మేము. ౧౩

తే. గీ. ప్రకృతి వికృతులను గలిపి యొకేడ రెండు
తేట తెల్లముగ నెవండు తెలిసికొనునొ
వాఁడు వికృతిచేతను మృత్యుపదము దాఁటి
పిదపఁ బ్రకృతిచే నమృతఁపుఁ బదము పొందు. ౧౪

వికృతియగు హిరణ్యగర్భు నుపాసించుటచే నణిమాద్యైశ్వర్యమును, ప్రకృతి నుపాసించుటచేఁ బ్రకృతిలయరూపమైన యమృతపదమును బొందునని భావము.



తే. పైపయి మెఱుఁగు బంగరుపాత్రచేతఁ
గరము సత్యదేవత మోము గప్పఁబడియె,
సత్య మగు ధర్మమార్గదర్శనము కొఱకు
పోషకుఁడ! తొలఁగింపు మీమూఁతపాత్ర. ౧౫

పోషకుఁడ!=సూర్యుఁడా! ఇందు సూర్యోపాసనద్వారా పరమేశ్వరోపాసన చేయఁబడుచున్నది పోషకుఁడ! అనుదానికి పోషించు పరమేశ్వరా అనియుఁ జెప్పుకొనవచ్చును. ఇందు ఆశయే బంగరుపాత్రగఁ జెప్పఁబడెను.



తే. పెంచి యొంటిపై నడపెడు విభునుతుఁడవు
కిరణముల నాపి తేజ మొక్కెడకుఁ జేర్పు
భాస్కరా! నీప్రసన్నరూపంబు గాంతు
నీనడుమ నున్న పురుషుఁడ నేనె సుమ్మి. ౧౬

"య ఏషోఽంత రాదిత్యే" అని పరమేశ్వరుఁడు సూర్యమండల మధ్యవర్తి యని యుపనిషత్తులలో వర్ణింపఁబడియె. శరీరమను పుర మ్ములో శయనించువాఁడు గానఁ బురుషుఁ డని వ్యుత్పత్తి.

వాయు రనిల మమృత మ, థేదం భస్మాంతం శరీరం
ఓం క్రితో స్మర, కృతం స్మర, క్రతో స్మర కృతం స్మర. ౧౭

ఇప్పుడు చనిపోవునా శరీరములోని ప్రాణవాయువు అధిదైవరూపమైన సర్వవ్యాపియైన గాలిలోఁ గలియుఁ గాక. ఈ శరీరము భస్మమగుఁ గాక. ఓ సంకల్పరూపమైన జీవుఁడా! చేసిన దానిని స్మరింపుము. ఓ జీవుఁడా చేసిన దానిని స్మరింపుము.

అగ్నే! నయ సుపథా రాయే
అస్మాన్, విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. ౧౮

ఓయగ్ని! మమ్ము కర్మఫలభోగరూపమైన ధనము కొఱకు మంచి మార్గముగుండ నడపుము. ఓదేవ! నీవు సర్వకర్మలను జ్ఞానములను దెలిసినవాఁడవు. మేము చేసినపాపమును పోఁగొట్టుము. నీకు మిక్కిలి నమస్కారవాక్యములను బలుకుదును.

శాంతి మంత్రః

ఓమ్

పూర్ణ మదః పూర్ణ మిదం, పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేర్ణ మేవావశిష్యతే.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇతి

ఈశావాస్యోపనిషత్.

ప్రాణమమృతంపు గాలిలో లీనమగుత
అవల ఈశరీరమును భస్మాంతమగుత
ఓయి సంకల్పమయజీవ! యీయదెల్ల
మఱచిపోకు చేసినదెల్ల మఱచిపోకు. 17

అగ్నిదేవ! జ్ఞానంబుల కబ్ధినీవు
ప్రబల మానందమొంద సత్పథిని నడపు
మేము చేయు పాపముల నశింపఁజేయు
ఇవె నమోవాకములను గావింతు మెన్నొ

శాంతిమంత్రము

ఓమ్.

పూర్ణము బ్రహ్మము జగమిది
పూర్ణమ యాపూర్ణ్ణు నుండి పూర్ణము వెడలెన్
పూర్ణంబగు నీజగతికిఁ
బూర్ణత్వము గూర్చి యికఁ బూర్ణమె మిగులున్.

ఓమ్.

శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇది

ఈశావాస్యోపనిషత్తు.

## తలవకారోపనిషత్
## వా
## కేనోపనిషత్
## (సామవేదాంతర్గతా)

### ప్రథమఃఖండః
### శాంతిమంత్రః
### ఓమ్

సహ నా వవతు, సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై
తేజస్వి నా వధీత మస్తు, మా విద్విషావహై 1

పరమాత్మ మమ్మిద్దఱనుగూడ రక్షించుఁగాక. మమ్మిద్దఱనుగూడఁ బోషించుఁగాక. మేమిద్దఱముగూడ విద్యాసామర్థ్యమును బొందుదుముగాక. మేము చదివినది తేజస్సుగలదై సార్థకమగుఁగాక, మేమిరువురుము పోరాడకుందుముగాక.

ఓమ్ ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః
శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి 2

నాయంగములైన వాక్కు, ప్రాణము, కన్ను, చెవి, శక్తి యన్ని యింద్రియములును సంతృప్తిగా నుండుగాక.

సర్వం బ్రహ్మోపనిషదం, మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం
మామా బ్రహ్మ నిరాకరో దనిరాకరణ మస్త్వనిరాకరణం మేఽస్తు 3

ఉపనిషత్తులు తెలుపునది అంతయు బ్రహ్మమె. నేను బ్రహ్మమును నివారింపకుందునుగాక. బ్రహ్మ నన్ను నిరాకరింపక పోవుఁగాక. నిరాకరింపకుండుట యగుఁగాక, నన్ను నిరాకరింపక పోవుఁగాక.

# తలవకారోపనిషత్తు

లేక

# కేనోపనిషత్తు

(సామవేదములోనిది)

## మొదటి ఖండము.

### శాంతిమంత్రము

ఓమ్.

మ మ్మీశుఁ డేలుతన్ మముఁ బెంచుఁగావుతన్
మేము తగు సామర్థ్య మెపు డొందుఁగావుతన్
మేము చదివిన దెల్ల మిగులఁ దేజిల్లుతన్
మే మెపుడు నేద్వేష మెఱుఁగక యె యుండుతన్.

ఇది గురుశిష్యుల పరస్పర ప్రార్థనము. ఈ యుపనిషత్తులలో దెలిసికొన్నది యనుభవనములోనికి వచ్చి సార్థకము కావలయు నని భావము. 1

నా యంగముల్ వాక్కు ప్రాణంబు కన్నుల్ చెవుల్ శక్తి
సర్వేంద్రియంబుల్ సదా సత్యధర్మంబులౌ కార్యముల్
చేయు సామర్థ్యముల్ గల్గి సంతృప్తితో నుండుతన్. 2
ఉపనిషత్తుల్ ప్రబోధించు సర్వంబు బ్రహ్మంబె, యాబ్రహ్మ
మున్ నేను వారింపకే యుండుతన్ నన్ను బ్రహ్మంబు
వారింపకే యుండుతన్ నన్ను వారింపకే యుండుతన్.

ఉపనిషత్తులలో ప్రబోధింపఁబడిన బ్రహ్మమును బొందుటకుఁ దగు సాధనము జేయుదునుగాక యని భావము. 3

తదాత్మని నిరతే, య ఉపనిషత్సు ధర్మాస్తే
మయి సంతు తే మయి సంతు. 4

అట్టి యాత్మయందు ఆసక్తి గలవానియందును, ఉపనిషత్తులందును ఏధర్మములు గలవో యవి నాయందుండుగాక అవి నాయందుండుగాక.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

శిష్యః.

కేనేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః
కేనేషితాం వాచ మిమాంవదంతి
చక్షుశ్శ్రోత్రం క ఉదేవో యునక్తి 1

ఎవనిచేఁ గోరఁబడి ప్రేరేపింపఁబడినదై మనసు తన విషయములపైఁ బడుచున్నది. ఎవనిచేఁ బ్రేరేపింపఁబడి ప్రధాన మగు ప్రాణము పని చేయును. ఎవనిచేఁ బ్రేరేపింపఁబడిన యీ వాక్కును జనులు పలుకుదురు కంటిని చెవిని ఏదేవుఁడు ప్రేరేపించును.

ఆచార్యః :—

శ్రోత్రస్య శ్రోత్రం మనసోమనో
యద్వాచోహవాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుషశ్చక్షు రతిముచ్యధీరాః
ప్రేత్యాఽస్మాల్లోకాదమృతాభవన్తి 2

దేవుఁడు చెవికిఁ జెవివంటివాఁడు, మనస్సుకు మనస్సు వంటివాఁడు వాక్కునకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, కంటికి కన్ను. పండితులు ఈ యింద్రియ రూపమును విడిచి, యాత్మను దెలిసికొని ఈలోకమునుండి పోయి అమృతులగుదురు.

ఉపనిషత్సూక్తులంమున్ బ్రశాంతాత్మలా వారియందెట్టి
ధర్మంబు లొప్పాఱునో యట్టి ధర్మంబులుగ్ కూడ నా
యందు వర్తిల్లుతన్ సర్వదా యవ్వి నాయందు వర్తిల్లుతన్

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

---

శిష్యుఁడు :—

మధు. ఎవనియిచ్ఛ ప్రేరణల కధీనమై మనసు మెసలు
ఎవనియిచ్ఛ ప్రేరణల కధీనమై ప్రాణ ముండు
ఎవనియిచ్ఛ ప్రేరణల కధీనమై వాక్కు పలుకు
ఎవనియిచ్ఛ కధీనమై యీ చెవుల్ కనులు చూచు.

సంస్కృతమున "కేన" అను పదముచే ఈ యుపనిషత్తు ప్రారంభింపఁ బడుటచే కేనోపనిషత్తు అని పేరు గలిగెను. 1

ఆచార్యుఁడు :—

మధు. అన్నిటికి మూల మగునీశుఁ డామనస్సునకు మనసు
ప్రాణములకుఁ బ్రాణము; మఱి వాక్కులకెల్ల వాక్కు,
చెవులకుఁ జెవి, కండ్లకుఁ గన్ను, స్థిరమతుల్ వానిఁగాక
వాని మూలపురుషుఁ గొల్చి మే నేఁగ ముక్తిఁగాంత్రు.

అన్ని యింద్రియములకు ఆయాశక్తుల నిచ్చువాఁడు పరమేశ్వరుఁడే యని తలఁచు పండితులు మోక్షము పొందుదురని భావము. 2

నతత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనో
నవిద్మోనవిజానీమో యథైత దనుశిష్యాత్.
అన్యదేవ తద్విదితాదథో అవిదితాధి
ఇతిశుశ్రుమ పూర్వేషాం యేనస్తద్వ్యాచచక్షిరే. 3

ఆ బ్రహ్మదగ్గరకు కన్ను వెళ్ళలేదు, వాక్కు వెళ్ళలేదు, మనస్సు వెళ్ళలేదు, తెలిసికొనలేము, ఎట్లు దీనిని తెలుపవలెనో ఎఱుంగము, అది తెలిసినదానికంటె మఱొకటి, తెలియని దానికంటెను మఱొకటే, మాకు దానిని వివరించి చెప్పిన పూర్వులవలన ఇట్లు వింటిమి.

యద్వాచాఽనభ్యుదితం యేనవాగభ్యుద్యతే
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే. 4

ఏది వాక్కుచే ప్రకటము కాదో దేనిచే వాక్కు వెడలునో అదే బ్రహ్మమని తెలిసికొనుము, నామరూపాది సహితముగా జనులచేఁ బూజింపఁబడునది బ్రహ్మము గాదు.

యన్మనసా న మనుతే యేనాహుర్మనోమతం
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే. 5

దేనిని మనస్సుచే జనులు తలఁపలేరో దేనిచే మనస్సు తలఁచు నని అందురో అదే బ్రహ్మ మని నీవు తెలిసికొనుము. నామరూపాది సహితముగా జనులచేఁ బూజింపఁబడునది బ్రహ్మము గాదు.

తే. గీ. కనులు దానిఁ జూడవు వాక్కు వినుప లేదు
మనసు గన లేదు, తెలియము వినుచు తెఱుఁగ
మదెఱిఁగినది కాదు, తెలియనిదియుఁ గాదు
పెద్దలు వచింప దీనిని వింటి మేము. 3

ఆపరమాత్మను కన్ను మొదలగునవి తెలిసికొనలేవు. అది ఇటువంటిదని చెప్పశక్యముగాని దగుటవలన తెలిసిన వస్తువులకంటె తెలియని వస్తువులకంటెను వేఱైనదని భావము.

తే. గీ. ఏది వాక్కులచేతను నెఱుఁగబడదో
దేనిచేతను వాక్కులు తెలియఁబడునో
అదియె బ్రహ్మమని తెలియు మంతె కాని
ఆయుపాసించెడునది బ్రహ్మంబు గాదు. 4

తే. గీ. ఎయ్యది మనస్సుచేత భావింపఁబడదో
దేనిచేతను మనసు భావింపఁగలదో
అదియె బ్రహ్మమని తెలియు మంతెగాని
ఆయుపాసించెడునది బ్రహ్మంబు గాదు. 5

యశ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంసి పశ్యతి
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. 6

దేనిని జనము కంటిచేతఁ జూడలేరో, దేనిచేత కన్నులు చూచుచున్నవో అదే బ్రహ్మ మని తెలిసికొనుము. నామరూపాది సహితముగా జనులచే బూజింపఁబడు నది బ్రహ్మము గాదు.

యచ్ఛ్రోత్రేణ నశృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతం
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే. 7

దేనిని జనము చెవులచేత వినలేరో దేనిచేత ఈ చెవి వినుచున్నదో అదే బ్రహ్మ మని తెలిసికొనుము, నామరూపాది సహితముగా జనులచేఁ బూజింపఁబడునది బ్రహ్మము గాదు.

యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే
తదేవ బ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతే. 8

దేనిని జనులు ముక్కుచే వాసన చూడలేరో దేనిచేత ముక్కు వాసన చూడఁగలదో అదే బ్రహ్మ మని తెలిసికొనుము, నామరూపాది సహితముగా జనులచేఁ బూజింపఁబడునది బ్రహ్మము కాదు.

ఇతి ప్రథమఃఖండః

---

అథ ద్వితీయఃఖండః

ఓమ్

ఆచార్యః.

యది మన్యసే సువేదేతి దభ్ర మేవాపి నూనం
త్వం వేత్థ బ్రహ్మణో రూపం య దస్య
త్వం యదస్య దేవే ష్వథః ను మీమాంస్య మేవతే. 1

తే. గీ. ఏది కన్నులచేత దర్శింపఁబడదొ
దేనిచేతను గనులకు దృష్టి గలిగె
అదియె బ్రహ్మమని తెలియు మంతె కాని
ఆయుపాసించెడునది బ్రహ్మంబు గాదు. 6

తే. గీ. ఏది చెవులచేతను నాలకింపఁబడదొ
వీను లవి దేనిచేతను వినుచునుండు
అదియె బ్రహ్మమని తెలియు మంతె గాని
ఆయుపాసించెడునది బ్రహ్మంబు గాదు. 7

తే. గీ. ముక్కుచే దేని జాడలు పొందలేము
దేనిచే ముక్కు వాసన తెలిసికొనునొ
అదియె బ్రహ్మమని తెలియు మంతె కాని
ఆయుపాసించెడునది బ్రహ్మంబు గాదు.

ఇందు మూలమందలి ప్రాణపదము ప్రాణవాయువునకు స్థానమైన ఘ్రాణేంద్రియమును తెలుపునని తెలియునది. 8

ఇది మొదటిఖండము.

---

ఇంక
రెండవఖండము.
ఓమ్

ఆచార్యుఁడు :—

తే. గీ. తెలిసె బ్రహ్మ బాగుగ నని తలఁతు వేని
తెలిసినదియు ద్వైవములలో నరసినదియు
స్వల్ప మే: నీవు మీమాంస సల్పవలయు;

శిష్య:—మన్యే విదితం.

"నేను బ్రహ్మమును బాగుగాఁ దెలిసికొంటినని నీవు తలంచినచో నిశ్చయముగా ఆబ్రహ్మరూపము గూర్చి తెలిసికొన్నదియు దైవములలో బ్రహ్మ రూపముగాఁ జూచినదియు స్వల్పమే. ఆబ్రహ్మమును గుఱించి ఇంకను నీవు మీమాంస చేయవలసి యున్నది", అని గురు వనఁగా "నాకు బ్రహ్మరూపము తెలిసిన"దని తలంతు నని శిష్యుఁ డనెను.

నాఽహం మన్యే సువే దేతి, నో నవే దేతి వేద చ
యోన స్తద్వేద త ద్వేద, నో నవే దేతి వేద చ. 2

బ్రహ్మమును బాగుఁగ దెలిసికొంటినని నేను దలఁపలేను, తెలిసికొన లేదని గాని తెలిసికొంటి నని గాని తలంపను. "తెలిసికొన లేదని గాని తెలిసికొంటి ననిగాని నేను తలఁపను" అని యీ మా బ్రహ్మచారులలో నెవ్వఁడు ఆబ్రహ్మమును గూర్చి తెలిసికొనునో వాఁడే యా బ్రహ్మమును దెలిసికొనును.

యస్యాఽమతం తస్య మతం, మతం యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాత మవిజానతాం.

ఇది శ్రుతివాక్యము. ఎవనికి బ్రహ్మస్వరూపమింతే యని నిశ్చయముగాఁ దెలియదో వానికి బ్రహ్మస్వరూపము తెలిసినది. ఎవనికి బ్రహ్మస్వరూపమింతే యని తెలియునో వాఁడా బ్రహ్మస్వరూపము నెఱుఁగఁడు. బ్రహ్మస్వరూప మింతే యని తెలిసికొన్న వారికిఁ దెలియఁబడలేదు. బ్రహ్మస్వరూప మింతే యని తెలిసికొన్న వారి కాబ్రహ్మస్వరూపము బాగుఁగ దెలియ"దని నిశ్చయము గలుగును. బాగుగఁ దెలియదను వారికి "మాకా బ్రహ్మ స్వరూపము తెలిసిన"దని నిశ్చయము గలుగును.

శిష్యుడు:—

బ్రహ్మమది తెలిసెనని తలఁతు నేను

బ్రహ్మము నామరూపాదిరహితము శాంతము అద్వైతము ఏకము వ్యాపినిత్యముకాన మనుష్య శరీరాదులందును, అగ్ని, సూర్యుఁడు మొదలగు వానియందును, నీవు బ్రహ్మముగఁ దెలిసికొన్నది స్వల్పమే యని భావము.

తే. గీ. బ్రహ్మ సరిగఁ దెలిసె నని తలంపలేను
తెలియ దని తెలిసె ననియుఁ దలఁపలేను
"తెలియ దని తెలిసె ననియుఁ దలఁప" ననుచు
వేరు మాలోన నది గాంచ్రతో వారె గాంచ్రతు.

బ్రహ్మము శబ్దస్పర్శ నామరూపాదులు లేక సర్వ విలక్షణమైనది కాన అది పూర్తిగఁ తెలియఁబడినదియుఁ దెలియనే తెలియక పోయిన దియుఁ గాదని భావము. 2

తే. గీ. తెలియ దని యెవ్వఁ డను, వాఁడె తెలిసికొనియె
తెలియునని యెవ్వఁడను, వాఁడె తెలిసికొనఁడు
అది తెలిసినవారికిఁ దెలియనిదె యగును
అది తెలియనివారికిఁ దెల్పి నట్టి దగును.

ఆచార్య శిష్యులవాక్యము పిదప శ్రుతియే స్వయముగ నిట్లు చెప్పి నది. బ్రహ్మస్వరూపము అవాఙ్మానస గోచరమును సర్వవిలక్షణ మును గాన బ్రహ్మస్వరూపము బాగుగ తెలిసిన దనుకొన్న వారికి ఆ బ్రహ్మముసరిగఁ దెలియ దని నిశ్చయ మగును. బ్రహ్మస్వరూపము బాగుగ దెలియ దన కొన్న వారికి ఆ బ్రహ్మము సరిగఁ దెలిసినదని నిశ్చయ మగునని భావము. 3

ప్రతిబోధవిదితం మత, మమృతత్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం, విద్యయా విందతేఽమృతం.

కట్టెలు మొదలగువానియందు వానికంటె విలక్షణమైన యగ్ని తోంచునట్లు బుద్ధిగత విషయ జ్ఞానములకంటె విలక్షణముగ సాక్షిగాఁ దోఁచు బ్రహ్మము బోధ బోధలోను (లేక గురు బోధచేఁ గాక) దెలియంబడినదై బాగుగఁ దెలియఁబడును. ఆత్మవిజ్ఞానముచే సామర్థ్యమును బొంది ఆత్మబోధక విద్యచే అమృతత్వ మొందును. 4

ఇహ చే దవేదీ దథ సత్య మస్తి, న చే దిహావేదీ
న్మహతీ వినష్టిః, భూతేషు భూతేషు
విచిత్య ధీరాః, ప్రేత్యాఽస్మాల్లోకా దమృతా భవంతి.

నరుఁడు ఈ లోకమందె బ్రహ్మమును దెలిసినచో మఱి యీ జన్మ ధన్యమగును. ఇందె బ్రహ్మము దెలియనిచో మహావినాశము గలుగును, అన్ని ప్రాణులలోను ధీరులు ఆబ్రహ్మము దెలిసికొని యీలోకము వీడి అమృతు లగుదురు. 5

ఇది ద్వితీయః ఖండః

---

అథ

తృతీయః ఖండః

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే, తస్య హ బ్రహ్మణో
విజయే దేవా అమహీయంత, త ఐక్షంతాస్మాక
మేవాయం విజయోఽస్మాక మేవాయం మహిమేతి.

బ్రహ్మము దేవతలకొఱకు అసురులను జయించెను. ఆ బ్రహ్మ జయమువలనఁగా దేవతలు మహిమ పొందిరి. "ఈ జయము, ఈ మహిమ, మాదే" యని దేవత లపుడు అనుకొనిరి.

తే. గీ. బోధబోధను సాక్షిగా బోధపడిన
నది తెలియు; దానిఁ గను జనుఁ డమృతుఁడగును
ఆత్మవిజ్ఞానముననుఁ సామర్థ్య మొంది
పిదప నాత్మవిద్యను మోక్షపదవిఁ గాంచు.

ఆత్మస్వరూప విజ్ఞానముచే శక్తిని బొంది యాత్మవిషయక జ్ఞానముచే మోక్షమును బొందు నని భావము. 4

మధు. ఇహమునసె బ్రహ్మఁ గనినచో నీజన్మ ధన్య మగును
ఇహమునసె బ్రహ్మఁ గననిచో నెంతో యనర్థ మగును
మహిని నెల్ల ప్రాణులలోన ధీరు లాత్మమును జూచి
యిహము వదలి పిదపఁ గృతకృత్యులై ముక్తిగాంత్రు. 5

ఇది
రెండవ ఖండము.

ఇంక
మూఁడవ ఖండము.

తే. గీ. దేవదానవ రణమున దేవతలకు
జయము నీశుఁడు గూర్చె నాజయమునందు
దేవతలు మహిమను బొంది, "యావిజయము
తన్మహిమయుఁ దమదె" యని తలఁచినారు. 1

తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యోహ ప్రాదుర్బభూవ
తన్న వ్యజానంత, కి మేత ద్యక్ష మితి.

ఈ దేవతలయొక్క మిథ్యాభిమానమును బ్రహ్మము తెలిసికొని వారి కొఱకు తాను ప్రత్యక్షమయ్యెను. అంతట ఈ పూజ్యమగు పదార్థ మేమొ ఆ దేవతలు తెలిసికొనలేకపోయిరి. 2

తేఽగ్ని మబ్రువన్, జాతవేద ఏత ద్విజానీహి
కిమిదం యక్ష మితి, తథేతి తదభ్యద్రవత్.

ఓజాతవేదుఁడా! యీ పూజ్యమైన పదార్థ మేమొ దానిని దెలిసికొనుమని యాదేవతలు అగ్నితో అనిరి. అట్లే యని యాయగ్ని యా పదార్థమును సమీపించెను. 3

త మభ్యవద త్కోఽసీ, త్యగ్ని ర్వా అహ మస్మీ త్యబ్రవీ
జ్జాతవేదా వా అహ మస్మీతి.

ఆపదార్థము "నీవెవరవు" అని యగ్ని నడిగెను. "నేను అగ్నిని, జాతవేదుఁడను (సర్వజ్ఞుఁడను) గాఁ గూడ నుంటి" నని యగ్ని యనెను. 4

తస్మిం స్త్వయి కిం వీర్య మితి
అపీదం సర్వం దహేయం, యదిదం పృథివ్యామితి.

అట్టి నీయందెట్టిశక్తి గలదని యాపదార్థ మడిగెను. "ఈ భూమియందున్న సమస్తమును దగులఁబెట్టుదు"నని యగ్ని యనెను. 5

తే. గీ. వారు తలఁపెంచి యీశుండు వారియెదుట
నపుడె యద్భుతాకృతిని బ్రత్యక్ష మయ్యె
అంత నాపూజ్య మైనపదార్థ మేమొ
తెలిసికొనలేక పోయిరి దేవగణము. 2

తే. గీ. అంత దేవత లగ్నితో నగిరి యిట్లు
నరగఁ దెలిసికొ మ్మది యేమొ జాతవేద!
ఎఱుఁగు మాపూజ్య మగువస్తు వేమొ యనఁగ
నట్లె యని దాని కడ కగ్ని యరిగెఁ దొరగ. 3

ఆ. వె. అగ్నిఁ జూచి పిదప నాపూజ్య మగువస్తు
వెవర వీవటంచుఁ బృచ్ఛ చేసె
అగ్ని యిట్టు లనియె "నగ్నిహోతుఁడ నేను
పేరువడితి జాతవేదుఁ డనియు." 4

కం. "అగుచో నీయం దేవిధ
మగుశక్తి గల"దని యాపదార్థము పలుకన్
"జగమునఁ గలుగు చరాచర
మగు నన్నిటిఁ గాల్ప నేర్తు"నని యగ్ని యనెన్. 5

తస్మై తృణం నిదధా, వేత ద్దహేతి, తదుప ప్రేయాయ
సర్వజవేన, త న్నశశాక దగ్ధుం, సతత ఏవ నివవృతే
నై త దశకం విజ్ఞాతుం యదేత ద్యక్షమితి.

దీనిని దహింపుమని యొకతృణము నుంచెను. తన సర్వశక్తితో అగ్ని దానిని సమీపించెను. దానిని దహింపలేక అగ్ని "యీ పూజ్య పదార్థమేమొ తెలిసికొన శక్యముగా"దని యక్కడ నుండి వెను కకు మరలెను. 6

అథ వాయు మబ్రువన్, వాయ వేత ద్విజానీహి
కి మేత ద్యక్షమితి, తథేతి తద భ్యద్రవత్.

ఓవాయువా! యీ పూజ్యమైన పదార్థమేమొ దీని దెలిసికొనుమని యా దేవతలు గాలితో ననిరి. అట్లే యని యా వాయువు ఆపదార్థ మును సమీపించెను. 7

త మభ్యవదత్కో౽సీతి, వాయు ర్వా అహ మస్మీ
త్య బ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి.

ఆవస్తువు "నీ వెవరవు" అని వాయువు నడిగెను. "నేను వాయువను మాతరిశ్వుఁడను (ఆకాశమందుఁ దిరుగువాఁడను)గాఁ కూడ నుంటినని వాయువనెను. 8

తస్మిం స్త్వయి కిం వీర్యమితి, అపీదం సర్వ
మాదదీయ యదిదం పృథివ్యా మితి.

అట్టి నీయం దెట్టి శక్తి గలదని యాపదార్థ మడిగెను. ఈ భూమి యందు గల సమస్తమును ఆకర్షింపఁగల నని వాయువనెను. 9

తే. గీ. "కాల్చు మటు లేని" యొక్క గడ్డిపరక
నగ్ని యెదుట నీశుఁడు వైచె నగ్ని యంత
బలముకొలఁదిఁ గాల్పఁగఁ బూని వ్యర్థుఁడగుచుఁ
దెలిసికొనఁ జాల నని వెన్క తెన్ను పట్టె. 6

తే. గీ. అంత సురలు వాయువుతోడ ననిరి యిట్లు
త్వరగఁ దెలిసికొ మ్మది యేమొ వాయుదేవ!
యెఱుఁగు మాపూజ్యమగు వస్తు వేమొ యనఁగ
నట్లె యని వాయు వయ్యెడ కరిగెఁ ద్వరగ. 7

ఆ. వె. అనిలుఁ జూచి పిదప నాపూజ్య మగువస్తు
వెవర వీవటంచుఁ బృచ్ఛ చేసె
వాయు విట్టు లనియె వాయుదేవుఁడ నేను
వృద్ధులంద్రు, మాతరిశ్వుఁ డనియు. 8

కం. "అగుచో నీయం దేవిధ
మగు శక్తిగల" దని యాపదార్థము పలుకన్
జగమునఁ గలుగు చరాచర
మగునన్నిటి లాగ్గివైతు నని వాయు వనెన్. 9

తస్మై తృణం నిదధా వేత దహేతి, తదుప ప్రేయాయ
సర్వజవేన త న్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే
నైత దశకం విజ్ఞాతుం యదేత ద్యక్ష మితి. 10

దీని ఆకర్షింపుమని యది యొకతృణము నుంచెను. తన సర్వ శక్తితో వాయువు దానిని సమీపించెను. దానిని ఆకర్షింపలేక వాయువు "ఈ పూజ్య పదార్థమేమొ తెలిసికొన శక్యముగా" దని యక్కడ నుండి మరలెను.

అ థేంద్ర మబ్రువన్ మఘవ న్నేత ద్విజానీహి కి మేత
ద్యక్ష మితి, తథేతి, తదభ్యద్రవత్ తస్మా త్తిరోదధే 11

"ఓ యింద్రుడా! యీ పూజ్యమైన పదార్థమేమొ తెలిసికొను" మని యా దేవతలు ఇంద్రునితో ననిరి. అట్లే యని యింద్రుడు దానిని సమీపించెను. అంత ఆ పదార్థము అక్కడ నుండి మాయ మయ్యెను.

స తస్మి న్నేవాకాశే స్త్రియ మాజగామ బహుశోభమానా
ముమాం హైమవతీం, తాం హోవాచ కి మేత ద్యక్ష మితి. 12

ఆ యాకాశమందే స్త్రీరూపము ధరించి, ఎక్కువ శోభగల బంగరు భూషణములు గల పార్వతిని జూచి సమీపించి ఆ ఇంద్రుడు ఈ పూజ్య పదార్థ మేమని యడిగెను.

ఇది తృతీయః ఖండః

---

అథ చతుర్థః ఖండః

సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణో వా ఏత ద్విజయే
మహీయధ్వ మితి, తతో హైవ విదాంచకార బ్రహ్మేతి. 1

"బ్రహ్మయొక్క యీ విజయమువలన మీరు మహిమ పొందితిరి" యని యుమాపార్వతి చెప్పెను. పిదప 'ఇది బ్రహ్మ' మని ఇంద్రుడు తెలిసికొనెను.

తే. గీ. "లాఁగు మటు లేఁ" యని యటుల్ గడ్డిపరక
వాయు వెదుట నీశుఁడు వైచె వాయు వంత
బలముకొలఁది లాగఁగఁ బూని వ్యర్థుఁ డగుచుఁ
దెలిసికొనఁ జాల నని వెన్క తెన్ను పట్టె.

తే. గీ. అంత దేవత లింద్రుతో ననిరి యట్లు
ఇపుడె తెలిసికొ మ్మది యేమొ యింద్ర! నీవు
ఎఱుఁగు మాపూజ్య మగు వస్తు వేమొ యనఁగ
నట్లె యని చేర నది మాయ మయ్యె నచట. 11

కం. సురపతి మిన్నున బంగరు
మెఱుఁగుల మేన మెఱయు పరమేశ్వరి గనియెన్
మఱి యీ పదార్థ మేమని
యెఱుఁగఁగ నయ్యాదిశక్తి నింద్రుం డడిగెన్. 12

ఇది
మూఁడవ ఖండము.

---

ఇంక
నాల్గవ ఖండము.

తే. గీ. "అదియె బ్రహ్మ; యా బ్రహ్మ జయంబు వలన
అధిక మగు మహిమను మీర లందివారు"
ఇట్టు లాదిశక్తి వచింప నింద్రుఁ డపుడు
దీని బ్రహ్మముగా లోనఁ దెలిసికొనియె. 1

తస్మాద్వా ఏతే దేవా అతితరా
మివాఽన్యాన్ దేవాన్ యదగ్ని ర్వాయు
రింద్రస్తే హ్యేన న్నేదిష్ఠం పస్పృశు
స్తే హ్యేన ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. 2

ఎందువల్ల అగ్ని, వాయువు, ఇంద్రుడు, వీరు ఈ బ్రహ్మమును దగ్గరగా ముట్టుకొనిరో వీరే ఈ బ్రహ్మమును ముందుగా తెలిసికొనిరో అందువల్ల ఈ దేవతలు ఇతర దేవతలకంటే శ్రేష్ఠులై యుండిరి.

తస్మాద్వా ఇంద్రోఽతితరా మివాఽన్యాన్ దేవాన్ స హ్యే
న న్నేదిష్ఠం పస్పర్శ సహ్యేనప్రథమోవిదాంచకారబ్రహ్మేతి. 3

ఎందువలన ఇంద్రుడు ఈ బ్రహ్మమును దగ్గరగా ముట్టుకొనెనో దీని బ్రహ్మముగా మొదట తెలిసికొనెనో అందువలన ఇంద్రుడు ఇతర దేవతలకంటె శ్రేష్ఠుడయ్యెను.

తస్యైష ఆదేశో యదేత ద్విద్యుతో వ్యద్యుతదా ఇతీతి
న్యమీమిషదా ఇత్యధిదైవతమ్. 4

ఆ బ్రహ్మమొక్క ఈ యుపదేశము మెఱుపుయొక్క మెఱుపువలె జరిగినది. ఇది దేవతల సమీపమున కనుఱెప్పపాటు కాలమున జరిగెను. ఇది అధిదైవతావిషయక మైనది.

అథాధ్యాత్మం యదేత ద్గచ్ఛతీవ చ మనోఽనేన
చైత దుపస్మర త్యభీక్ష్ణం, సంకల్పః. 5

ఇంక ఆత్మనుగూర్చి యుపదేశము చేయఁబడుచున్నది. ఏమనస్సు ఈ బ్రహ్మమును దెలిసికొనఁబోవు చున్నదివలె నున్నదో యీ మనస్సుచేతనే సాధకుఁడు ఈ బ్రహ్మమును స్మరించు చున్నాఁడు. ఇదే సంకల్పము.

తే. గీ. తొలుత నగ్నియు వాయు విం(ద్రుఁడును దాని
బ్రహ్మముగఁ దెలిసికొని దాని స్పర్శభాగ్య
మొందుకతమున దేవతలందు వారు
(శేష్ఠులై యుత్తమఖ్యాతిఁ జెందినారు. 2

తే. గీ. బ్రహ్మదరి కేగి యా స్పర్శభాగ్య మంది
మొట్టమొదటనె తెలిసికొన్నట్టి కతన
ఎల్ల దేవతలందు నాయిం(ద్రుఁ డంత
నెంతయును (శేష్ఠుఁడై గణియింపఁబడియె. 3

తే. గీ. ఇటుల బ్రహ్మోపదేశంబు చిటికెలోన
మెఱపు మెఱసినరీతిని మెఱసిన యది
మఱియుఁ గనురెప్పపాటులో జరిగెను: నధి
దేవతాపరముగ నిది తెలుపఁబడియె. 4

తే. గీ. ఇంక నాత్మపరముగ వచింపఁబడును
మనసు బ్రహ్మమున్ గనఁ బైన మయినయటులఁ
జనును; సాధకుం డాబ్రహ్మ మనసుతోడఁ
గరము స్మరియించు; శుద్ధసంకల్ప మిదియె. 5

తద్ధ తద్వనం నామ తద్వన మిత్యుపాసితవ్యం
సయ ఏతదేవంవేదాభిహైనం సర్వాణిభూతాని సంవాంఛంతి 6

ఆబ్రహ్మము ఆ ప్రాణిజాతమునకు వనమువంటిది. (=సేవింపఁదగినది) కాన "తద్వన" మని ఆబ్రహ్మము నుపాసింపవలయును. దానిని దెలిసిన వానిని సర్వభూతములు సేవించును. చెట్లకు వనమునకుఁ గలిగినట్టి సంబంధమె ప్రాణులకు బ్రహ్మమునకుఁ గలదఁయుఁ దెలియునది.

ఉపనిషదం భో బ్రూ, హీత్యుక్తా త ఉపనిషత్
బ్రాహ్మీం వావ త ఉపనిషద మబ్రూ మేతి. 7

"ఓభగవంతుఁడా! ఉపనిషత్తును జెప్పుము" అని యడిగితివి గాన నీకి యుపనిషత్తు చెప్పఁబడెను. ఇంక నీకు బ్రహ్మమును గుఱించిన యుపనిషత్తును జెప్పెదము అని గురువు శిష్యునితో ననెను.

తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా
వేదాః సర్వాంగాని, సత్య మాయతనం. 8

ఆ యుపనిషత్తునకు తపస్సు ఇంద్రియనిగ్రహము. అగ్నిహోత్రాది కర్మలు వేదములు వేదాంగములగు శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము ఛందస్సు జ్యోతిషము ఇవి యాధారమైనవి. సత్యము నివాసస్థానము.

యో వా ఏతా మేవంవే దాపహత్య పాప్మాన
మనంతే స్వర్గేలోకే జ్యేయే ప్రతితిష్ఠతి 9

ఎవఁడిట్లు ఈ బ్రహ్మవిద్యను దెలిసికొనునో వాఁడు పాపమును బోఁగొట్టుకొని అనంతమైన యుత్తమమైన ఆనందమయమైన పరబ్రహ్మమందు నిలుచును.

తే. గీ. బ్రహ్మ మది, వృక్షములఁబోలు ప్రాణితతికి
వనముగఁ బ్రసిద్ధమౌట "తద్వన" మటంచు
బ్రహ్మము నుపాసనము చేయవలయు; దీనిఁ
దెలియు నరుని భూతములెల్లఁ గొలుచుచుండు.

తత్ = ఆ ప్రాణిసమూహమునకు, వనము = సేవింపదగినది అని వ్యుత్పత్తి, వన=సంభక్తౌ అని ధాతువు (నారాయణ విరచిత కేనోపనిషద్దీపిక ననుసరించి యీ వ్యాఖ్య) 6

తే. గీ. "ఓయి భగవంతుఁడా! నాకు నుపనిషత్తు
చెప్పఁడని యంటి" వది గాన నిప్పు డిటుల
నుపనిషత్తు చెప్పఁబడెను; నిపుడె బ్రహ్మ
దెలుపు నుపనిషత్తు నింక బోధింతుమోయి.

ఇది శిష్యుని గూర్చి గురువు చెప్పిన వాక్యము. 7

తే. గీ. తపము దమమును నగ్నిహోత్రాది క్రియలు
అఖిల వేదంబులు మఱి వేదాంగములును
ఆయుపనిషత్తునకు నాశ్రయంబు లగును
సత్య మొకటె దానికి నివాసస్థలంబు. 8

దమము=ఇంద్రియ నిగ్రహము, శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, కల్పము అనునవి వేదాంగములు.

తే. గీ. దీని నెవఁ డిట్లు చక్కఁగఁ దెలిసికొనునొ
వాఁడు పాపంబు నంటక స్వచ్ఛమతిని
నంతు లేక శ్రేష్ఠమయి యానంద మయిన
నిర్గుణ బ్రహ్మపదమున నిలుచు నిలుచు. 9

శాంతి మంత్రః ఓమ్

సహ నా వవతు, సహనౌ భునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వి నా వధీత మస్తు, మా విద్విషావహై.

పరమాత్మ మమ్మిద్దఱను గూడ రక్షించుగాక, మమ్మిద్దఱను గూడ బోషించుగాక, మేమిద్దఱము గూడ విద్యాసామర్థ్యమును బొందు దుముగాక. మేము చదివినది తేజస్సుగలదై సార్థకమగుగాక, మే మిరువురము పోరాడకుందుముగాక.

ఓం అప్యాయంతు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షుః
శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి.

నాయంగములైన వాక్కు ప్రాణము, కన్ను, చెవి, శక్తి యన్ని యింద్రియములును సంతృప్తిగా నుండుగాక.

సర్వం బ్రహ్మోపనిషదం, మాఽహం బ్రహ్మనిరాకుర్యాం
మామా బ్రహ్మనిరాకరోద నిరాకరణ మస్త్వ నిరాకరణం మేఽస్తు.

ఉపనిషత్తులు తెలుపునది అంతయు బ్రహ్మమె. నేను బ్రహ్మమును నిరాకరింపకుందునుగాక. బ్రహ్మ నన్ను నిరాకరింపక బోవుగాక, నిరాకరింపకుండుట యగుగాక, నన్ను నిరాకరింపక పోవుగాక.

తదాత్మని నిరతే, య ఉపనిషత్సు ధర్మాస్తే
మయిసంతు తే మయి సంతు.

అట్టి యాత్మయందు ఆసక్తిగలవానియందును, ఉపనిషత్తులందును ఏ ధర్మములుగలవో యవి నా యందుండుగాక. అవి నాయందుండు గాక.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇది చతుర్థః ఖండః

కేనోపనిషత్ సమాప్తా.

## శాంతి మంత్రము.

ఓమ్

మమ్మొక్కటఁ జేలుతన్ మమఁ బెంచుఁ గావుతన్
మేము తగు సామర్థ్య మెపు డొందుఁ గావుతన్
మేము చదివినదెల్ల మిఁగులఁ దేజిల్లుతన్
మేమెపుడు నేద్వేష మెఱుఁగకయె యుండుతన్.

ఇది గురుశిష్యుల పరస్పర ప్రార్థనము. ఈ యుపనిషత్తులలోఁ దెలిసి కొన్నది యనుభవములోనికి వచ్చి సార్థకము కావలయునని భావము.

నాయంగముల్ వాక్కు ప్రాణంబు కన్నుల్ చెవుల్ శక్తి
సర్వేంద్రియంబుల్ సదా సత్య ధర్మంబు లే కార్యముల్
చేయు సామర్థ్యముల్ గల్గి సంతృప్తితో నుండుతన్
ఉపనిషత్తుల్ ప్రబోధించు సర్వంబు బ్రహ్మంబె యాబ్రహ్మమున్
నేను వారింపకే యుండుతన్ నన్ను బ్రహ్మంబు వారింపకే
యుండుతన్ నన్ను వారింపకే యుండుతన్.

ఉపనిషత్తులలో ప్రబోధింపఁబడిన బ్రహ్మమును పొందుటకుఁ దగు సాధనము జేయుదునుగాక యని భావము.

ఉపనిష త్సూక్తులందున్ ప్రశాంతాత్మలా
వారియం దెట్టి ధర్మంబు లొప్పారునో యట్టి ధర్మం
బులుం గూడ నాయందు వర్తిల్లుతన్ సర్వదా
యవ్వి నాయందు వర్తిల్లుతన్.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఉపనిషత్సుధా కఠోపనిషత్

(కృష్ణ యజుర్వేదాంతర్గతా)

ప్రథమాధ్యాయే ప్రథమా వల్లీ.

శాంతిమంత్రః

ఓమ్.

సహ నా వవతు సహనౌ భునక్తు సహ వీర్యం కరవావహై

తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై॥

తా. పరమాత్మ మమ్మిద్దఱను రక్షించుఁగాక. మమ్మిద్దఱను బోషించుఁగాక. మే మిద్దఱముకూడ విద్యాసామర్థ్యమును బొందుదుముగాక. మే మిద్దఱము చదివినది తేజస్సు గలదగుఁగాక. మే మిరువురము పోరాడకుందుముగాక.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

---

ఓమ్ ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ

తస్య హ నచికేతా నామ పుత్ర ఆస. 1

తా. వాజశ్రవసుఁడు యజ్ఞఫలమును గోరినవాఁడై యజ్ఞమందు తన ధన మంతయు దానము చేసెను. అతనికి నచికేతుఁ డను పుత్రుఁడు గలఁడు.

తం హ కుమారం సంతం దక్షిణాసు నీయమానాసు

శ్రద్ధా వివేశ సోఽమన్యత॥ 2

# ఉపనిషత్స్వధ కఠోపనిషత్తు

(కృష్ణ యజుర్వేదము లోనిది)

## మొదటి యధ్యాయమున మొదటివల్లి

### శాంతిమంత్రము.

ఓమ్.

మమ్మోర్మిశుఁ డేలుతన్ మముఁ బెంచుఁ గాపుతన్
మేము తగు సామర్థ్య మెపు డొందఁ గావుతన్
మేము చదివిన దెల్ల మిగులఁ దేజిల్లుతన్
మే మెప్పుడున్ ద్వేష మెఱుఁగకయె యుండుతన్.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

---

క. మును వాజశ్రివసుండను
ఘనుఁ డిమ్మహి యజ్ఞఫలము కాంక్షించి కడున్
ధనమంత దానమిడె; నా
తనికిన్ నచికేతుఁ డనెడి తనయుం డుండెన్॥

వివ:– ఈ యుపనిషత్తు కఠమహర్షి చే దర్శింపఁబడినది గానఁ గఠోపనిషత్తు అని పిల్వఁబడెను.

తే. తండ్రి దక్షిణల్ విశ్వజిద్యాగమందు
ఋత్విజులకు సదస్యుల కిచ్చుచుండ

ఋత్విక్కులకు సదస్యులకు దక్షిణలీయఁబడుచుండఁగా సత్పురుషుఁడైన యా కుమారునికి శ్రద్ధ గలిగెను. అతఁ డిట్లు తలఁచెను.

పీతోదకా జగ్ధతృణా, దుగ్ధదోహా నిరింద్రియాః
అనందా నామ తే లోకా, స్తాన్ స గచ్ఛతి దదత్॥ 3

ఇదివఱకు నీరుత్రాగి యిప్పుడు త్రాగలేక, ఇదివఱకు గడ్డితిని యింకఁ దినలేక, ఇదివఱకుఁ బాలిచ్చి యింకఁ బాలివ్వని, యింక ఈనలేని గోవులను దానము చేయువాఁడు ఆనందకరముగాని లోకములను పొందును.

స హోవాచ పితరం, తత (తాత) కస్మై మాం దాస్యసీతి
ద్వితీయం తృతీయం తం హోవాచ, మృత్యవే త్వా దదామీతి 4

'తండ్రీ! నన్నెవరికిచ్చెదవు' అని యతఁడు తండ్రితో ననెను. రెండవసారి మూఁడవసారి తండ్రి నడిగెను. "మృత్యువు కొఱకు నిన్నిచ్చెదను" అని తండ్రి కోపముతో ననెను.

(భాష్యం) స ఏవముక్తః పుత్ర ఏకాంతే పరిదేవయాంచకార.
(తా. చూ. ప్రక్క—)

బహూనామేమి ప్రథమో, బహూనామేమి మధ్యమః
కిం స్విద్యమస్య కర్తవ్యం, యన్మయాఽద్య కరిష్యతి॥ 4

చాలమంది శిష్యులలో నేను మొదటివాఁడనుగ నుంటిని. చాలమందిలో మధ్యముఁడనుగానైన నుంటిని. నేను యమునికిఁ జేయవలసినదేమి? నావల్ల అతని కేమి లాభము కలుగును?

(భాష్యం) తథాపి తత్పితుర్వచో మృషా మాభూ దిత్యేవం మత్వా పరిదేవనాపూర్వకమాహ పితరం శోకావిష్టం "కింమయోక్త" మితి.
(చూ. తాత్పర్యము ప్రక్క—)

అమలగుణుఁడై న నచికేతుఁ డాతఁడంబ
యెద సదుద్దేశ ముదయింప నిట్లు తలఁచె॥ 2

ఆ. "నీరు ద్రావలేని, నెమరు వేయఁగలేని
పాల నీయని, యిఁకఁ జూలు గనని
యావు లిచ్చు దాత యసుఖంబులై యుండు
భువనములను నెపుడు పొందుచుండు" 3

తే. అనుచుఁ దలపోసి తండ్రితోఁ దనయుఁ డపుడు
తండ్రి! నన్నెవ్వరికి నీయఁ దలఁచి నాఁడ
వనుచు నినుమాఱు మమ్మాఱు లడుగ నలిగి
యముని కర్పింతు నిన్నని యనియెఁ దండ్రి॥ 4

(భాష్యము) తండ్రిచే నిట్లు పలుకఁబడి ఏకాంతమందు పుత్త్రు డిట్లు విచారించెను.

ఆ. వె. పదురలోన నేను మొదటివాఁడుగ నుంటి
పోని నడిమివాఁడ నేని యగుదు
నట్టి నేను యముని కాచరించున దేమి
యిపుడు నన్నుఁ గని యముఁ డేమిపొందు॥ 5

(భాష్యము) అయినను తన తండ్రి మాట యబద్ధము కారాదని తలఁచి 'నేనేమి యంటిని' అని విచారించు తండ్రితో విచారముతో నిట్లనియె.

అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే
సస్యమివ మర్త్యఃపచ్యతే, సస్యమివాఽఽజాయతే పునః॥ 6

మన పూర్వులెట్లు నడచిరో చూడుము. ఇప్పటివారు కూడ ఎట్లు నడచుచున్నారో జూడుము. మనుష్యుఁడు పంటవలెఁ బండి రాలును. పంటవలె దిరిగి పుట్టును.

(భాష్యం) సఏవముక్తః పితాఽఽత్మనః సత్యతాయై ప్రేషయామాస. సచ యమభవనం గత్వా తిస్రో రాత్రీ రువాస యమే ప్రోషితే. ప్రోష్యాఽఽగతం యమ మమాత్యా భార్యా వా ఊచుః॥
(చూ. తా. ప్ర౪౮)

వైశ్వానరః ప్రవిశ త్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్
తస్యైతాం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకం. 7

అతిథియైన బ్రాహ్మణుఁడు ఇంటికి అగ్నిహోత్రుఁడై ప్రవేశించును. అతనికి జనులు శాంతిని కూర్చెదరు. యముఁడా! యతనికి నీళ్లు తెమ్ము.

ఆశాప్రతీక్షే సంగతం సూనృతం చేష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్
ఏతద్వృంక్తే పురుష స్యాల్పమేధసో యస్యాఽనశ్నన్ బ్రాహ్మణో గృహే.

ఎవనియింట బ్రాహ్మణుఁడు భుజింపక యుండునో యా యల్పబుద్ధి గల పురుషుని యాశను (=తెలియని పొందఁదగిన స్వర్గాది ఫలమును) ప్రతీక్షను (=తెలియఁదగిన రాజ్యాదిఫలమును) సత్సంగ ఫలమును, ప్రియవాక్కులవల్ల సిద్ధించిన ఫలమును, యజ్ఞఫలమును, నూయి త్రవ్వించుట మొదలగు వానివల్ల వచ్చిన ఫలమును, పుత్రులను బశువులను అన్నిటిని ఇది నశింపఁజేయును.

కం. మన పూర్వుల నేఁటి ప్రజన్
గనుఁగొను మేరీతి వారు నడచిరొ భువిలో
మనుజుఁడు సస్యము పోలిక
ననయము పండుచును జనన మందుచు నుండున్. 6

(భాష్యము) ఇట్లు చెప్పఁగాఁ దండ్రి తన సత్యమును నిలుపుకొనుటకుఁ గొడుకును బంపెను. ఆ నచికేతుఁడును యముని యింటికి వెళ్ళి యముఁడు ఎక్కడికో వెళ్ళఁగా నప్పుటనే మూఁడు రాత్రిలు భుజింపక యుండెను. తిరిగి వచ్చిన యమునితో అతని మంత్రిలు గాని భార్యగాని యిట్లనిరి.

తే. గీ. అతిథియై గృహస్థులయిండ్ల కరుగుదెంచు
బ్రాహ్మణుండు సాక్షాత్తుగా వహ్నిసుమ్ము
ఆతనిని శాంతిపఱచెద రార్యు లెల్ల
నంబువులఁ దెమ్ము యమ! వాని కర్ఘ్య మీయ॥ 7

వివ:-ఒకతిథి కంటె నెక్కువగా నింట నుండనివాఁడు అతిథి. బ్రాహ్మణుఁడు=బ్రహ్మవేత్త.

తే. గీ. ఎవనియింట బ్రాహ్మణుఁడు వస్తువడియుండు
నట్టివాని జ్ఞాతాఽజ్ఞాత ప్రాప్యఫలము
సూనృతము, యజ్ఞఫలితంబు, సుతులు పసులు
పూర్తములు సర్వము నశించి పోవుఁ జుమ్ము॥ 8

వివ:-జ్ఞాతాఽజ్ఞాత ప్రాప్యఫలము=జీవుల కర్మలనుబట్టి కలుగు తెలిసి పొందఁదగు రాజ్యాధి ఫలములు, అజ్ఞాత ఫలము=తెలియని పొందఁదగిన స్వర్గాది ఫలములు, సూనృతము=ప్రియవాక్యఫలము, పూర్తములు =చెఱువు, తోట, నూయి, గుడి మొదలగువానిచేఁ గల్గు ఫలములు.

(భాష్యం) ఏవముక్తో మృత్యు రువాచ నచికేతస
ముపగమ్య పూజాపురస్సరః (తా. చూ. ప్రక్క)

తిస్రోరాత్రీ ర్య దవాత్సీ ర్గృహే మేఽనశ్నన్ బ్రహ్మన్నతిథి ర్నమస్యః
నమస్తేఽస్తు బ్రహ్మన్స్వస్తిమేఽస్తు తస్మా త్ప్రతి త్రీన్వరాన్ వృణీష్వ.

ఓ బ్రాహ్మణుడా! నమస్కరింపదగిన యతిథివై వచ్చి నాయింట భుజింపక యెందువల్ల మూడు రాత్రు లుంటివో యందువల్ల ఒక్కొక్క రాత్రి కొక్కొక్కవరము చొప్పున మూడు వరములు కోరుకొనుము. ఓబ్రాహ్మణుడా! నీకు నమస్కార మగుగాక. నాకు శుభ మగుగాక.

నచికేతా:—

శాంతసంకల్పః సుమనా యథా స్యా ద్వీతమన్యుర్గోతమో
మాఽభిమృత్యో త్వత్ప్రసృష్టం మాఽభివదే త్ప్రతీత,
ఏత త్త్రయాణాం ప్రథమం వరం వృణే.

ఓ యముడా! నాతండ్రియగు గోతముడు శాంతించిన సంకల్పము కలవాడై ప్రసన్నుడై నన్నుగూర్చి కోపము లేనివాడై నన్ను నీచే విడువబడినవానినిగా నమ్మి ప్రీతితో బల్కునట్లు ఈమూడు వరములలో మొదటి వరముగా దీని నడుగుచున్నాను.

యమః—

యథా పురస్తా ద్భవితా ప్రతీత, ఔద్దాలకి రారుణి ర్మ త్ప్రసృష్టః
సుఖంరాత్రీః శయితా వీతమన్యు స్త్వాం దదృశివాన్
మృత్యుముఖా త్ప్రముక్తం.

అరుణుని కుమారుడైన యుద్దాలకుడు నాచే ననుజ్ఞ పొందినవాడై యిదివఱకువలె నీయందు నమ్మకము గలవాడై యుండును. కోపము వీడి సుఖముగా రాత్రులందు నిద్రించును. నిన్ను మృత్యు ముఖము నుండి విడినవానినిగా జూడగలడు.

(భాష్యము) ఇట్లు పలుకఁగా యముఁడు నచికేతుని సమీపించి పూజించి యిట్లనియె.

తే. గీ. ఓయి బ్రహ్మస్వరూప! చేదోయి మోడ్చి
మ్రొక్కెదఁగు నతిథిగ వచ్చి మూఁడు నాళ్ళు
పస్తుపడి యుంట నుంటివి; నీపాప మేమి
పోరయనటు కోరుకొను మూఁడు వరము లిపుడు. 9

నచికేతుఁడు :-

మృత్యుముఖమునఁ బడిన నీఁడేటి కనెడు
తలఁపు శాంతిల గౌతముం డలుక యుడిగి
ఈవు నను ముక్తుఁ జేయుట యెల్ల నమ్మి
ప్రీతి మాటాడఁ దొలి వరంబిమ్ము యముఁడ! 10

యముఁడు :-

నాయనుగ్రహంబున నరుణాత్మజుండు
నీదుతండ్రి యుద్దాలకుం డెప్పటివలెఁ
బ్రీతిఁ గని యల్గకయె నీవు మృత్యుముఖము
గడచు టది చూచి సుఖనిద్ర గాంచు నిశల. 11

నచికేతాః —

స్వర్గే లోకే న భయం కించ నాస్తి, న తత్ర త్వం న జరయా బిభేతి
ఉభే తీర్త్వాఽశనాయా పిపాసే, శోకాతిగో మోదతే స్వర్గలోకే

తా. స్వర్గలోకమున ఏభయమును లేదు, అక్కడ నీవు లేవు. ముసలితనముచే అక్కడి జనము భయపడరు. ఆఁకలి దప్పికల రెంటిని దాటి విచారము లేక స్వర్గలోకములో ఆనందింతురు.

స త్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో, ప్రబ్రూహి త్వం శ్రద్ధధానాయ
మహ్యం స్వర్గలోకా అమృతత్వం భజంత ఏతద్ద్వితీయేన వృణే వరేణ

తా. ఓ మృత్యుదేవతా! స్వర్గసాధనమగు నగ్ని నెఱుఁగుదువు. శ్రద్ధగల నాకు దానిని జెప్పుము. స్వర్గమందలి వారు చావును బొందరు. ఇదే రెండవ వరముచే నడుగుచున్నాను.

యమః —

ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ, స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్
ఆనందలోకాప్తి మథో ప్రతిష్ఠాం, విద్ధి త్వమేతం నిహితం గుహాయాం

తా. ఓ నచికేతుఁడా! స్వర్గమునకు సాధనమైన యగ్నిని గూర్చి ఎఱుఁగుదును. నీకు దానిని బాగుగఁ జెప్పెదను దానిని నావల్లఁ దెలిసికొనుము. దీనిని స్వర్గలోకము పొందించుదానినిగను జగత్తున కాధారమైన దానినిగను, విద్వాంసులబుద్ధి యను గుహలో నున్న దానినిగను దెలిసికొనుము.

లోకాదిమగ్నిం తమువాచ తస్మై, యా ఇష్టకా యావతీర్వా
యథా వా స చాపి తత్ప్రత్యవదద్యథోక్త మథాస్య మృత్యుః
పునరేవాహ తుష్టః. 15

తా. లోకమున కాధారమైన యగ్నిఁ గూర్చి యముఁడు నచికేతునకుఁ జెప్పెను. దాని కెన్ని ఇటుకలు కావలయునో ఎంతవి గావలయునో ఎట్లు చేయవలెనో కూడఁ జెప్పఁగా నచికేతుఁడు యముఁడు చెప్పిన రీతిగాఁ జెప్పెను. అంత అది విని మెచ్చుకొని తిరుగ యముఁ డనెను.

నచికేతుఁడు:—

తే. గీ. స్వర్గమం దెట్టి రోగాది భయము లేదు
చంపుటకు నీవు లేవుగా! జరయు రాదు
ఆఁకలిని దప్పికను దాఁటి శోక మేమి
పొందక యట నుందురఁట యానందముగను. 12

తే. గీ. స్వర్గవాస్తవ్యు లమృతత్వ పదవి గాంత్రు
అట్టిస్వర్గసాధన మైన యగ్ని నెఱుఁగు
దీవు యమ! స్వర్గమున శ్రద్ధ నెసఁగునాకు
నగ్ని నెఱిఁగింపు మిదియె రెండవ వరంబు. 13

యముఁడు:—

తే. గీ. అగ్ని నెఱుఁగుదు, స్వర్గసంప్రాప్తి హేతుః
నగ్ని నెఱిఁగింతు నచికేత! యరసికొనుము
అదియు స్వర్గసాధనము లోకాశ్రయంబు
హృదయగుహ నుండునది యని యెఱుఁగుమోయి. 14

తే. గీ. యముఁడు లోకాది యగు నగ్ని నపుడ చెప్పె
నెట్టి యిటుకలో యవి యెన్ని యెట్లు చేయ
నగునో గూడఁ జెప్పఁగ నాతఁ డట్లె సరిగఁ
జెప్ప విని మెచ్చి యముఁ డంతఁ జెప్పె మరల. 15

త మబ్రవీ త్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య
దదామి భూయః తవైవ నామ్నా భవితాఽయ మగ్నిః
సృంకాం చేమామనేకరూపాం గృహాణ.

తా. మహాత్ముఁడైన యముఁడు సంతోషించినవాఁడై నచికేతుని కిట్లనియె. ఇప్పుడు నీ కింకొక వర మిచ్చెదను. నీ పేరుతోనే యీయగ్ని ప్రసిద్ధిఁబొందును. అనేక రూపములు గల యీ మాలికను లేక అనేక భోగములు గల యీ మార్గమును గ్రహింపుము.

త్రిణాచికేత స్త్రిభి రేత్య సంధిం త్రికర్మ కృ త్తరతి జన్మమృత్యూ
బ్రహ్మజజ్ఞం దేవ మీడ్యం విదిత్వా నిచాయ్యేమాం శాంతి
మత్యంత మేతి.

తా. మూఁడుసార్లు నచికేతాగ్నిని చయనము చేసినవాఁడై, తల్లి దండ్రుల గురువుల శాసనప్రకారము నడచి యజ్ఞములు, దానము, వేదాధ్యయనములు చేసినవాఁడు చావుఁబుట్టుకలను దాఁటును. బ్రహ్మమునుండి పుట్టి జ్ఞానరూపుఁడైన, స్తుతింపఁదగిన దేవుని దెలిసికొని చూచి యత్యంతమైన ఈశాంతిని బొందును.

త్రిణాచికేత స్త్రయ మేత ద్విదిత్వా య ఏవం విద్వాం శ్చినుతే
నాచికేతం స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య, శోకాతిగో
మోదతే స్వర్గలోకే.

తా. ఏ విద్వాంసుఁడు మూఁడుసార్లు నాచికేతాగ్నిని చయనము చేసినవాఁడై ఎన్ని యిటుకలో, ఎంతటివో, యెట్లో ఈమూఁటిని తెలిసికొని యిట్లు నాచికేతాగ్నిని చయనము చేయునో వాఁడు చనిపోక మునుపగనె మృత్యుపాశములను ద్రెంచి వైచి శోకమును దాఁటి స్వర్గలోకమున సంతోషించును.

ఏష తేఽగ్ని ర్నచికేతః స్వర్గ్యో య మవృణీథా ద్వితీయేన వరేణ
ఏత మగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస స్తృతీయం వరం
నచికేతో వృణీష్వ.

తా. ఓ నచికేతుఁడా! ఏ యగ్నిని రెండవ వరము చేఁ గోరితివో యట్టి స్వర్గసాధనమైన యగ్ని యిదిగో. ఈయగ్నిని నీ పేరుతోనే జనులు పిలిచెదరు. నచికేతుఁడా! మూఁడవ వరమును గోరుము.

తే. గీ. అటు మహాత్ముఁడౌ యముఁ డెంతొ యలరి పలికె
మఱియు నిదె నీకు నింకొక్క వరము నిడుదు
నీదు పేరనె యీయగ్ని నెగడఁ గలదు
ఈవిచిత్రహా దండ గ్రహింపు మోయి. 16

వివ:- ఈవిచిత్రహారదండ=ధనాదిరూపమైన మాలిక లేక భోగరూపమైన దారి.

మధు. నాచికేత సాగ్నిని చయనంబు ముమ్మారు చేసి
పితృగురుల మెచ్చి దానేష్టి వేదపాఠము లొనర్చి
జన్మమృత్యువు లనియెడు సంకెళ్ళనుండి దాఁటు
దేవు స్తవనీయు, సర్వజ్ఞుఁ దెలిసి ప్రశాంతి గాంచు॥ 17

వివ :- పితృగురులు=మాతాపితృగురులను దానేష్టి వేదపాఠములు=దానములు, ఇష్టి=యాగములు, వేదాధ్యయములు.

మధు. ఎట్టి యిటుకలో యవి యెన్ని యెట్లు చేయంగవలెనో
యెఱిఁగి నాచికేతాగ్ని ముమ్మారు చయనంబుచేయు
పండితుండు మృత్యుపాశముల్ ఖండించివైచి ముందె
యవల వగ దాఁటి, స్వర్గమునందు నానంద మొందు॥ 18

కం. ఎవి రెండవవరమున నడు
గుదు వదె యీస్వర్గ్య మగ్నిఁ గొను నచికేతా!
ఇది జనముల నీ పేరను
ప్రథితం బగు; నిఁకఁ దృతీయవరము నడుగుమా. 19

నచికేతః —

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే-స్తీత్యేకే నాయ మస్తీతి చైకే
ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాహం, వరాణా మేష వర స్తృతీయః

తా. మనుష్యుఁడు చనిపోఁగా ఆత్మ యను నది యున్నదని కొందఱు, లేదని కొందఱు. ఇట్టి యీసందేహమును నీచే నుపదేశింపఁబడి నేను తెలిసికొందును గాక, ఇది వరములలో మూఁడవ వరము.

యమః —

దేవై రత్రాపి విచికిత్సితం పురా, నహి సువిజ్ఞేయ మణు రేష ధర్మః
అన్యం వరం నచికేతో వృణీష్వ మా మోపరోత్సీ రతి మా సృజైనం

తా. ఈ విషయములోఁ బూర్వము దేవతలచేఁ గూడ సందేహింపఁబడినది. ఇది సులభముగాఁ దెలియఁబడునదిగాదు. ఈ ధర్మము సూక్ష్మమైనది. ఓ నచికేతుఁడా! మఱియొక వరమును గోరికొనుము, నన్ను బలవంతపెట్టకు. ఈ వరమును విడువుము.

నచికేతాః —

దేవై రత్రాపి విచికిత్సితం కిల, త్వంచ మృత్యో యన్న సువిజ్ఞేయ
మాత్థ వక్తా చాస్య త్వాదృ గన్యో న లభ్యో నాన్యో వర స్తుల్య
ఏతస్య కశ్చిత్.

తా. ఈ విషయములో దేవతలచే సందేహింపఁ బడినదిగదా! ఓ మృత్యుదేవతా, నీవును ఇది సులభముగాఁ దెలియఁబడదని యంటివి దానిని చెప్పువాఁడు నీవంటివాఁడు మఱియొకఁడు దొరకఁడు. దీనితో సమానమైన వర మేదియును లేదు.

యమః —

శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ, బహూన్ పశూన్ హస్తి
హిరణ్య మశ్వాన్ భూమే ర్మహ దాయతనం వృణీష్వ, స్వయంచ
జీవ శరదో యావ దిచ్ఛసి.

తా. నూఱేండ్లు ఆయుష్షుగల కొడుకులను మనుమలను చాలపశువులను ఏనుగులను బంగారమును గుఱ్ఱములను గోరుము. భూమి రాజ్యమును గోరుము. కోరినన్ని యేండ్లు నీవు జీవింపుము.

నచికేతుఁడు:

తే. గీ. మనుజుఁడు గతింప నీస్థూలతనువు గాక
యాత్మ యొకటున్నదండ్రు; లేదనియు నొకరు
తెలుపుదురు; దాని నెఱింగింపు తెలిసికొందు
నిదియె వరములలో మూఁడవది మహాత్మ! 20

యముఁడు:

తే. గీ. దేవతలకును నిట్టి సందియమె మున్ను
గలిగె నచికేత; సులువుగాఁ తెలియఁ బడదు
నాత్మ యీధర్మము; మఱొండు చూచి కోరు
మింక బలవంతపెట్టకు మిద్ది విడుము॥ 21

నచికేతుఁడు:

తే. గీ. దేవతలకును నిట్టిసందియమె మున్ను
గలిగె నంటివి సులువుగాఁ దెలియఁ బడని
దంటి; విది తెల్పువాఁడు నీవంటివాఁడు
మఱొండు దొరకఁ డిటువంటి వర మిఁకేది. 22

యముఁడు:

తే॥ భువిని నూఱేండ్లు జీవించు; పుత్రపౌత్రి
గణము గోరుము; గజవాజి గణము గోరు
పసులు భూరాజ్యమును గోరు; స్వర్ణ మడుగు
మిష్ట మున్నన్ని యేండ్లు జీవింపవోయి. 23

ఏత త్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ
మహాభూమౌ నచికేత స్త్వమేధి. కామానాం త్వా కామభాజం కరోమి

తా. దీనితో సమానమైన వర మింకొకటియున్న దని తలంచితి వేని దానిని గోరుము. ధనమును దీర్ఘాయువును గోరుము. ఓ నచికేతా, ఈ విశాలభూమియందు వర్ధిల్లుము. నిన్ను కోరికలలో నన్నికోరికలను బొందఁ గలిగినవానినిగఁ జేయుదును.

యే యే కామా దుర్లభా మర్త్యలోకే, సర్వాన్ కామాన్ ఛందతః
ప్రార్థయస్వ ఇమా రామాః సరథాః సతూర్యా. నహీదృశా
లంభనీయా మనుష్యైః ఆభి ర్మత్ ప్రత్తాభిః పరిచారయస్వ,
నచికేతో మరణం మానుప్రాక్షీః

తా. ఏయేకోరికలు భూలోకములో దొరకవో యాకోరిక లన్నిటిని స్వేచ్ఛగా నడుగుము. రథములతో వాద్యములతోఁ గూడిన స్త్రీలు వీరుగో. ఇటువంటికోరికలు మనుష్యులచేఁ బొందఁదగినవిగావు. నేనిచ్చిన వీరిచేతఁ బరిచర్య చేయించుకొనుము. ఓ నచికేతుఁడా! మరణము గూర్చి అడుగకుము.

నచికేతాః

శ్వోభావా మర్త్యస్య యదంత కైతత్, సర్వేంద్రియాణాం
జరయంతి తేజః అపి సర్వం జీవిత మల్పమేవ,
తవైవ వాహా స్తవ నృత్యగీతే. 26

తా. ఓ యముఁడా! నీవిచ్చు భోగములు రేపు ఉండునో యుండవో అను సందేహము గలవి. మఱియు నవి మనుష్యుల సర్వేంద్రియముల తేజస్సును క్షీణింపఁజేయును. ఆజీవిత మంతయును స్వల్పమే. కనుక గుఱ్ఱములు నీకే యుండుఁగాక. నీకే నృత్తములు గీతములు ఉండుఁగాక. నాకు వలదు.

న విత్తేన తర్పణీయో మనుష్యో, లప్స్యామహే విత్త
మద్రాక్ష్మ చేత్త్వా జీవిష్యామో యావ దీశిష్యసి త్వం,
వరస్తు మే వరణీయః స ఏవ. 27

[చూ. తా. ప్రక్క

తే॥ గీ॥ దీనికి సమంబైన వరం బెదేని యున్న
దాని నైనఁ జిరాయువు, ధనము నైన
నడుగు నచికేత; భువి వృద్ధి నందఁ గలవు
సకలకామార్హుఁగా నినుఁ జలుపఁగలను 24

తే॥ గీ॥ క్షితి దొరకని కోర్కులను యథేచ్ఛ నడుగు
మవిగో రథతూర్యములు వారె యప్సరసలు
మానవుల కివ్వి దొరకవు వీనిచేత
సేవగొను; మృత్యుఁగూర్చి ప్రశ్నింపకోయి. 25

తే॥ గీ॥ రేపటికి సంశయ మగు కోరికలు నరుల
యన్ని యింద్రియముల తేజ మడఁచివైచు
అంత దీర్ఘాయువును గూడ నల్పమె సుమి
నీకె యుండుత రథగీతనృత్యవితతి. 26

తే॥ గీ॥ ధనముచే మానవుఁడు తృప్తి గనఁగ లేడు
ఇందు నినుఁ జూడ ధనములఁ బొందగలము
ఈవు శాసించుదనుక జీవింపగలము
కనుక వాంఛింతు మును గోరికొనిన వరమె. 27

తా. మనుష్యుఁడు ధనముచేఁ దృప్తి పొందువాఁడు గాఁడు. నిన్నుఁ జూచినచో మేము ధనము పొందఁగలము. నీవు పాలించువఱకు జీవింపఁ గలము. కాని నాకుఁ గోరఁదగినది యావరమే.

అజీర్యతా మమృతానా ముపేత్య జీర్యన్మర్త్యః క్వధస్థః ప్రజానన్
అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా. నతిదీర్ఘే జీవితే కో రమేత

తా. ముసలితనములేని చావులేని మిమ్ముఁ బొంది "ముసలివాఁడ నగుదును, చనిపోవుదును" అని తెలిసినవాఁడెవ్వఁడు వానియం దాశ గలవాఁడగును. రూపమువల్ల ప్రేమవల్లఁ గలుగు సుఖమును ధ్యానించుచు మిగుల దీర్ఘమైన జీవితమందు ఎవఁడు ఆనందించును.

యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సాంపరాయే మహతి
బ్రూహి నస్తత్ యోఽయం వరో గూఢ మనుప్రవిష్టో. నాఽన్యం
తస్మాన్నచికేతా వృణీతే

తా. ఓ మృత్యుదేవతా! ఏ పరలోకవిషయమున ఈ సంశయము పొందుచుండిరో గొప్పదైన పరలోకమున ఏది గలదో దానిని నాకుఁ జెప్పుము. ఈ వరము గూఢముగా నున్నదిగాన ఈ నచికేతుఁడు మఱియొక వరమును గోరఁడు.

ఇతి ప్రథమాధ్యాయే ప్రథమావల్లీ

---

అథ

## ద్వితీయా వల్లీ

అన్యచ్ఛ్రేయో ఽన్యదుతైవ ప్రేయ, స్తే ఉభే నానార్థే పురుషం
సినీతః తయోః శ్రేయ ఆదదానస్య సాధు, భవతి హీయతేఽర్థా ద్య
ఉ ప్రేయో వృణీతే

తా. శ్రేయస్కర మైనది యొకవిధమైనది. ప్రియతర మైనది మఱొకవిధమైనది. ఆరెండు వేర్వేఱు ఫలములు గలవి. అవి పురుషుని బంధించి వైచును. ఆరెంటిలో శ్రేయస్కరమైన దానిని స్వీకరించు వానికి శుభమగును. ఎవఁడు ప్రియతరమైనదానిని గోరునో వాఁడు పరమప్రయోజనమగు మోక్షమునుండి జాఱి పోవును.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత, స్తే సంపరీత్య వివినక్తి ధీరః
శ్రేయో ధీరోఽభి ప్రేయసో వృణీతే, ప్రేయో మందో యోగ
క్షేమాద్వృణీతే

తే. గీ. జరయు మృతి లేని మిము బోంటి జనులఁ జేరి
జరయు మృతి పొందు నెఱిఁగిన జనుఁడు వాని
నెట్లు గోరును; సుఖగీత నృత్యవితతి
నెదను ధ్యానించుచుఁ జిరాయు వెట్లు గోరు    28

తే. గీ. మృత్యుదేవ! పెద్దలు సంశయించుచుండు
చావు తెరువాతి సంగతి సరిగఁ దెలుపు
ఈవరము గూఢ మైనది యిందువలన
అదియె గాకొండు నచికేతుఁ డడుగఁ డయ్యె.    29

ఇది మొదటి యధ్యాయమున మొదటివల్లి.

---

## అంత మొదటి యధ్యాయమున రెండవవల్లి.

కం. శుభ మొకటి, ప్రియము మఱొకటి;
విభిన్న ఫలము లివి; నరు నివియె బంధించున్
శుభమును గైకొన మేలగు
శుభము విడిచి ప్రియము గొనఁగ శుభగతి యడఁగున్.

వివ:—శుభము=అప్పటికి సుఖముగ నుండకపోయినను ధర్మసహితమై శాశ్వతమగు మేలును గూర్చునది. ప్రియము=అప్పటికి సుఖముగ నున్నను బిదపఁ జాల కష్టమును గూర్చునది.

తే. గీ. శుభము ప్రియమును మనుజులఁ జొచ్చుచుండు
ధీరుఁ డవ్వాని వివరించి తెలిసికొనును

తా. శ్రేయస్సును ప్రియమును మనుష్యుని జేరును. ధీరుఁడు వానిని బాగుగ ఆలోచించి వేఱు వేఱుగఁ దెలిసికొనును. ధీరుఁడు ప్రియము కంటె శ్రేయస్సు మంచి దని శ్రేయస్సునే గోరును. మూర్ఖుఁడు కేవల శరీర యోగక్షేమము కొఱకైన పశుపుత్రధనాది ప్రియవస్తువులను గోరును.

యమః —

స త్వం ప్రియాన్ ప్రియరూపాంశ్చ కామా, నభిధ్యాయ
న్నచికేతో౽త్యస్రాక్షీః నైతాం సృంకాం విత్తమయీ మవాప్తో,
యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః.

తా. ఓ నచికేతుఁడా! నీవు ప్రియమైన పశుపుత్రి ధనాదులను, సుందర రూపముగల యప్సరస్స్త్రీలు మొదలగు కోరికలను అవి యసారములని తలఁచి విసర్జించితివి. అట్టి చాలమంది మనుష్యులు మునిఁగి తేలక పడిపోయెడి యీధనరూపమైన యీ మాలను మార్గ మును బుచ్చుకొనలేదు.

దూర మేతే విపరీతే విషూచీ, అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా
విద్యా౽భీప్సినం నచికేతసం మన్యే, న త్వా కామా బహవో
లోలుపంతః.

తా. అవిద్య క్రియరూపమైనది, విద్య శ్రేయస్సు రూపమైనది అని తెలుపఁబడు నీరెండిటికిఁ జాలదూరము. ఇవి భిన్న భిన్న ఫలములు గలవి. నిన్ను విద్యను గోరు నచికేతునిగాఁ దలఁచుచున్నాను. నిన్నుఁ జాల కోరికలైనను ఆశ పెట్టలేవు.

అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయం ధీరాః
పండితం మన్యమానాః దంద్రమ్యమాణాః పరియంతి మూఢా,
అంధే నైవ నీయమానా యథాంధాః.

తా. అవిద్యలో నున్నవారై తాము స్వయముగ ధీరులమని పండితులమని తలఁచి, గ్రుడ్డివారిచే దారి చూపఁబడిన గ్రుడ్డివారువలె మూఢులు మిగుల వక్రగతిలోఁబడి జననమరణ చక్రములఁబడిపోవుదురు.

న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్త
మోహేన మూఢం అయం లోకో నాస్తి పర ఇతిమానీ,
పునః పున ర్వశ మాపద్యతే మే. [మూ. తా. ప్రక్క—

ప్రియము విడనాడి శుభమునె విబుధుఁ డెంచు
బొందుఁ బ్రియమె యోగక్షేమ మొంద జడుఁడు. 2

యముఁడు :-

తే॥ గీ॥ ప్రియములు ప్రియరూప మగుకోరిక లనిత్య
మనుచు నచికేత! త్యజించి తయ్య వాని
కూలి బహుమనుష్యులు మున్గి తేలకుండు
ధనమయం బైన యీదండ గొన వయితివి. 3

మ॥ ధు॥ విద్య యు నవిద్య యనఁబడు వీనికిఁ జాల దూర
మివి పరస్పరము విరోధు; లివి భిన్నఫలము గలవి
పొగడ విద్య గోరు నచికేతుఁగ నిన్ను మదిఁ దలంతు
నిన్ని కోరిక లైనను నీకాశ గూర్ప లేదు. 4

తే॥ గీ॥ తా మవిద్యలోనుండియుఁ దాము ధీరు
ల మని పండితుల మని తలంచి జడులు
గ్రుడ్డివారిచేఁ గొనిపోవఁ బడ్డ గ్రుడ్డి
వారువలె భ్రమింతురు తప్పుదారిని బడి. 5

వివ:- తప్పుదారినిబడి చావుఁబుట్టుకలను బొందుచుందు రని భావము

తే॥ గీ॥ పొరపడుచు ధనవ్యామోహమున మతిచెడు
జడునకు స్ఫురింపదు మోక్షసాధనంబు
ఇహమెగాని పర మను నదెచట లేదు
అను నతఁడెపుడు నావశుఁ డగుచు నుండు. 6

తా. ధనవ్యామోహముచేఁ బొరపాటుపడుచు మూఢుడైన యవి వేకికి పరాపరబ్రహ్మప్రాప్తి సాధనము స్ఫురింపదు. ఈలోకమె గాని పరలోకము లేదని తలఁచువాడు మాఁటి మాఁటికి నాకు వశమై చావుఁ బుట్టుకలను పొందును.

శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః శృణ్వంతోఽపి బహవో యం నవిద్యుః ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽశ్చర్యో జ్ఞాత కుశలానుశిష్టః

తా. ఏది వినుటకును జాలమందికి లభింపదో విన్నవా రైనను జాల మంది దేనిని దెలిసికొనలేరో యట్టి యీ యాత్మనుగూర్చి చెప్పువాఁడు అద్భుత మైనవాఁడు. దీనిని బొందినవాఁడై నేర్పరి యైన గురువుచే నుపదేశింపఁబడినవాఁడై తెలిసికొన్నవాఁడు ఆశ్చర్యకర మైనవాఁడు.

న నరేణావరేణ ప్రోక్త ఏష, సువిజ్ఞేయో బహుధా చింత్యమానః అనన్యప్రోక్తేఽగతి రత్ర నా. స్త్యణీయాన్ హ్యతర్క్య మణుప్రమాణాత్.

తా. ఈయాత్మ హీనుఁడైన మనుష్యునిచేఁ జెప్పఁబడినదిగాదు. అనేక విధములుగ వాదులచేఁ జింతింపఁ బడినది గాన సులభముగఁ దెలియఁ దగినది గాదు. శ్రేష్ఠుఁడైన యాత్మదర్శియైన యాచార్యుడు చెప్పినచో దెలియకపోవుట యుండదు. ఇది యతిసూక్ష్మమైనది గదా. అణుస్వరూపము గలది గాన ఇది తర్కమున కందనిది.

నైషా తర్కేణ మతి రాపనేయా, ప్రోక్తాఽన్యే నైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ! యాం త్వ మాపః సత్యధృతి ర్బతాసి, త్వాదృఙ్ నో భూయా న్నచికేతః ప్రష్టా

తా. ఓ ప్రియతముఁడా! ఏ జ్ఞానమును నీవు సత్యమగు ధైర్యము గలవాఁడవై పొందితివో అట్టి జ్ఞానము తర్కముచేఁ బొందఁదగినది గాదు. శ్రుతివిదుఁడగు గురువుచేఁ జెప్పఁబడినదై సులువుగఁ దెలియఁ బడును. ఓ నచికేతా! నీవంటి ప్రచ్ఛకుఁడు మాకుఁ గలుగుఁ గాక.

జానా మ్యహం శేవధి రిత్యనిత్యం, న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువంతత్ తతో మయా నాచికేత శ్చితోఽగ్నిః రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవా నస్మినిత్యం [చూ. తా. ప్రక్క

మధు. వినుటకును బెక్కుర కేది లభింప శక్యంబు గాదో
దేని విని యును బెక్కురు తెలియంగలేరో యట్టి
యాత్మం దెలుపు వాం డద్భుతస్వాంతుండు పొందువాండు
జ్ఞాన, కుశలు బోధం దెలియు జనము లాశ్చర్యమతులు. 7

వివ :- కుశలుబోధన్=నేర్పరియైన గురువుయొక్క బోధచేత.

తే॥ గీ॥ వినుమి యిది యల్పనరులు చెప్పినది గాదు
పలుగతిం దలంతురి సులువుగాం దెలియంబడదు
ఆత్మదర్శి తెలుపం దెలియనిది గాదు
అణువుకంటె నణువు, తర్కమునకుం జొరదు 8

వివ :- ఈ యాత్మను కర్తగను, శుద్ధముగ నశుద్ధముగం బలు
విధములుగ వాదులు దలంతురు గాన సులువుగం దెలియం
బడుట లేదని భావము.

తే॥ గీ॥ జ్ఞాన మెది సత్యధృతి నీవు గంటివోగద
జ్ఞాన మిది తర్కమునం బొందరానిది సుమి
జ్ఞాన మిది వేదవిదుని చేం గలుగు బ్రియుండ!
వెలయుత నచికేత! నినుంబోల్ పృచ్ఛకుండు. 9

వివ :- తర్కము వాది ప్రాబల్యముచే అనేకవిధము లగును. కాన
దానికి నిలుకడలేదు. అనుభవించి నమ్మినవానికికే జ్ఞానము
తెలియు నని భావము.

మధు. నే నెఱుంగుదును నిధు లనిత్యంబులైన వనుచు
నిత్యమది; పొందంగా రా, దనిత్యవస్తువులచేత
నిందుచే నచికేత! యనిత్యవస్తువుల నగ్ని
చయన మొనరించి స్వల్పనిత్యయమపదమ్మ గంటి. 10

వివ :- మానవ భోగములద్వారా నిత్యముగాన యమపదవి నిత్య
మనంబడెను.

తా. పశుపుత్రధనాదిరాసులు అనిత్యమని యెఱుంగుదును. ధ్రువమైన యాపరమాత్మ అనిత్యవస్తువులచేం బొందంబడదు. కనుక ఇట్లు తెలిసియు నేను నాచికేతాగ్ని నె చయనము చేసితిని. అందుచే ఈ యనిత్యవస్తువులచేం గొంతకాలమె నిత్యముగ నుండు యమపదమునే పొందితిని.

కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతో రనంత్య మభయస్య పారం
స్తోమంమహదురుగాయంప్రతిష్ఠాం. దృష్ట్వాధృత్యాధీరోనచికేతో
ఒత్యస్రాక్షీః

తా. ఓ నచికేతుఁడా! కోరికలకు సమాప్తి యైన జగత్తున కాధార మైన యజ్ఞముయొక్క యనంతఫల మైనట్టియు నిర్భయపుఁ జివరి హద్దయి నట్టియుఁ గొనియాడఁ దగినట్టియు విస్తీర్ణగతి గలిగినట్టియు. నగు నాత్మ స్థితిని ధైర్యముగాఁ జూచి ధీమంతుఁడవై యీ సంసారము లోని భోగము లన్నిటిని విడచి వైచితివి.

తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణం
అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి.

తా. చూడఁగ సులభము గానిదియు, గూఢమైనదియు, ప్రచ్ఛన్న ముగా నున్నదియు, హృదయగుహలో నున్నదియు, అనేకానర్థము లతోఁ గూడిన దుర్గమస్థానమున నున్నదియు. సనాతన మైనదియు నగు దైవస్వరూపమైన యాత్మను భోగములనుండి మనస్సును మరలించి యాత్మయందలి ధ్యానముతోఁ దెలిసికొను ధీరుఁడు సంతోషమును దుఃఖమును విడచి అతీతించినవాఁడగును.

ఏత చ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధర్మ్య మణు మేత
మాప్య స మోదతే మోదనీయం హి లబ్ధ్వా, వివృతం సద్మ నచి
కేతసం మన్యే

తా. మనుష్యుఁడు ఈపరమాత్మను నిశ్చయముగఁ దెలిసికొని, ధర్మమునుండి తొలఁగని సూక్ష్మమైన యాత్మను శరీరాదులకంటె వేఱుగఁ దెలిసికొని దీనిని పొంది సంతోషింపఁ దగిన దీనిని బొంది సంతోషించును. నచికేతుఁడగు నిన్నుఁ గూర్చి ఆత్మభవనము తలుపు తెఱువఁబడెనని తలంచెదను.

నచికేతా:

అన్యత్ర ధర్మా దన్యత్రాఽధర్మా దన్యత్రాస్మా త్కృతాకృ
తాత్ అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద 14

మధు. కామములకు సమాప్తి; లోకాధార మైన చోటు
అంతు లేని యజ్ఞఫలంబు, నభయంపుఁ జివరి హద్దు
అధిక గతి మహత్తును స్తుత్యమై యొప్పు నాత్మఁ గాంచి
ధృతిని నచికేత; కోర్కుల్ త్యజించి ధీరుండ వైతి. 11

మధు. కష్టమునఁ జూడఁ దగినది, గహనము, దాగినదియు,
హృదయగుహ నుండునది గహ్వరేష్ఠ మనాది యైన
దైవ మాత్మఁ గోర్కెలనుండి తరలించు బుద్ధిచేత
ధ్యానమునఁ గాంచు ధీరుండు హర్ష శోకములఁ గనఁడు.

వివ :- గహ్వరేష్ఠము=అనేకానర్థములతోఁ గూడిన దుర్గమ స్థానమున నున్నది.

తే. గీ. దీని విని చక్కఁగ గ్రహించి మానవుండు
తనువుకంటె వేఱుగ నెంచి, ధర్మ్య మణువు
మోదకర, మాత్మఁ గని మోదమొందుఁ; దలుపు
నాత్మ నచికేత; తెఱచి నీ కని తలంతు. 13

వివ :- ఆత్మను దన శరీరాదులకంటె భిన్నముగఁ దలఁచి గ్రహించిన వాఁడు ఆత్మానందము బొందునని భావము.

నచికేతుఁడు :

తే. గీ. ధర్మ కర్మకంటె నధర్మ కర్మకంటె
నఖిల కార్య కారణములకంటె, భూత

తా. ధర్మముకంటె వేఱుగను అధర్మముకంటె వేఱుగను కార్య కారణములకంటె వేఱుగను భూతవర్తమాన భవిష్యత్తులకంటె వేఱుగను దేనిఁ జూచెదవో దానిని జెప్పుము.

యమః

సర్వే వేదా యత్పద మామనంతి. తపాంసి సర్వాణి చ యద్వదంతి
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ బ్రవీ
మ్యోమిత్యేతత్

తా. సర్వవేదములును దేనిని బొందఁదగినదిగఁ దెలుపుచున్నవో, సర్వతపస్సులును దేనిని జెప్పుచున్నవో, దేనిని గోరి జనము బ్రహ్మచర్యమును జేయుచున్నారో యట్టి యాత్మపదమును సంగ్రహముగఁ దెల్పెదను. అది ఓమ్ అనునదే.

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏత దేవాక్షరం పరం
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్. 16

తా. ఈ ఓమ్ అను నక్షరమె బ్రహ్మము. ఈయక్షరమె గొప్పది. ఈ యక్షరమును దెలిసికొని ఎవఁడు దేనిని గోరునో వానికది దొరకును.

ఏత దాలంబనం శ్రేష్ఠ, మేత దాలంబనం పరం
ఏత దాలంబనం జ్ఞాత్వా, బ్రహ్మలోకే మహీయతే. 17

తా. ఈ యాధారమైన యక్షరమే శ్రేష్ఠమైనది. ఈయాధారమె గొప్పది. ఈ యాధారమును దెలిసికొని సాధకుఁడు బ్రహ్మలోకమందు గొప్పవాఁడగుచున్నాడు.

న జాయతే మ్రియతే వా విపశ్చి, న్నాయం కుతశ్చి న్న
బభూవ కశ్చిత్ అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో,
నహన్యతే హన్యమానే శరీరే.

తా. ఈయాత్మ పుట్టదు. చావదు కూడ. జ్ఞానముగలది. ఇది దేనివల్లను బుట్టలేదు. ఈయాత్మనుండి యేదియుఁ బుట్టలేదు. పుట్టుకలేనిది, నిత్యమైనది. ఇది ప్రాచీనమైనది. శరీరము చంపఁబడినను జంపఁబడదు.

వర్తమాన భావులకంటెఁ బ్రస్ఫుటముగ
భిన్నముగఁ జూతు వెవి దాని విశదపఱుపు. 14

యముఁడు:

తే. గీ. ఎల్ల వేదంబు లెదిపొంద నెఱుకపఱచు
ఎల్ల తపము లేపదముఁ బ్రాప్తింపఁ జేయు
అంద ఱెది కోరి బ్రహ్మచర్యము చరింత్రు
అది వినుతు సంగ్రహముగ ఓమ్ అనునదదియె. 15

కం. ఈ యక్షరంబె బ్రహ్మము,
ఈ యక్షరమె పరతత్త్వ మెఱుఁగుమి యిటులన్
ఈ యక్షరము దెలియు జనుఁ
డే యది వాంఛింప నదె లభించును జుమ్మా 16

కం. ఇదె యాధారము శ్రేష్ఠము
ఇదె యాధారము పరంబు హృది నిటు గనుమీ
ఇదె యాధారము దెలిసిన
బుధవర్యుఁడు బ్రహ్మలోకమున వర్ధిల్లున్. 17

తే. గీ. పుట్టదది చావదది జ్ఞాన మొప్పెడునది
పుట్టదది యెందు మఱి యేది పుట్టదిందు
పుట్టనిది నిత్యము స్థిరము మున్నటియది
చావదది యీ శరీరంబు చంపఁబడిన. 18

వివ :- ఓంకారముచేఁ జెప్పఁబడిన బ్రహ్మస్వరూప మిందు చెప్పఁబడినది.

హంతా చే న్మన్యతే హంతుం, హత శ్చే న్మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో. నాయం హంతి న హన్యతే 19

తా. చంపఁ దలఁచువాఁడు వీనిఁ జంపెదనని తలఁచినచో, చంపఁబడఁబోవువాఁడు తాను జంపఁబడుదు నని తలఁచినచో వీరిద్దఱు తెలియని వారె. ఇతఁడు చంపలేఁడు. వాడు చంపఁబడఁడు.

అణో రణీయాన్ మహతో మహీయా నాత్మాఽస్య జంతోర్ని
హితో గుహాయాం త మక్రతుః పశ్యతి వీతశోకో. ధాతుః ప్రసాదా
న్మహిమాన మాత్మనః 20

తా. ఈయాత్మ సూక్ష్మముకంటె సూక్ష్మ మైనది. గొప్పదాని కంటె గొప్పది. ఈయాత్మ ప్రాణుల యొక్క హృదయగుహయందు గూఢమై యున్నది. మనస్సు ఇంద్రియములు మొదలగు ధాతువులు ప్రసన్నముగా నుండుటవల్లఁ గోరికలు లేని దుఃఖములు వీడిన మనుష్యుఁడు ఆత్మ యొక్క యా మహిమను జూచును.

ఆసీనో దూరం వ్రజతి. శయానో యాతి సర్వతః
క స్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి 21

తా. ఆత్మ కూర్చుండియును దూరముగఁబోవును. పరుండియుండి గూడ అన్నిచోట్లకు వెళ్ళును. సంతోషరూపము, అసంతోషరూపము ఇట్టి విలక్షణ రూపములుగల యాదేవుని నేనుగాక యింక నెవఁడు తెలిసికొనఁగలఁడు

అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితం
మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి 22

తా శరీరము లేనట్టియు. అనిత్యములగు దేవపితృమనుష్యాది శరీరములందు వికారము లేకయున్నట్టియు. గొప్పదైనట్టియు సర్వవ్యాపకమైన యాత్మను దెలిసికొని ధీరుఁడు విచారింపఁడు.

నాఽయమాత్మ ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్య. స్తస్యైష ఆత్మా వివృణుతే
తనూం స్వాం

తే. గీ. తాను జంప హంతకుఁ డెదన్ దలఁచునేని
హతుఁడు చంపఁబడుదు నంచు ననుకొను నెడ
వార లిరువురు తెలియనివారు సుమ్ము
వాఁడు చంపఁ డాతఁడు చంపఁబడుట లేదు. 19

వివ:-ఆత్మ నాశనములేనిది గాన దానిని నెవరు చంపలేరని భావము.

తే. గీ. అణువుకంటె నణువు; మహత్తునకు మహాత్తు
ఆత్మ ప్రాణి హృదయగుహ నణఁగి యుండె
నవని నింద్రియశుద్ధిచే నాత్మమహిమఁ
గాంచఁ గలఁ డాశ చింతయుఁ గననివాఁడు. 20

తే. గీ. కూరుచుండి యుండియుఁ గూడ దూర మరుగు
పండియుండియు నంతటఁ బరుగువాఁడు
ఆ ప్రహర్షాప్రహర్ష స్వరూపు దేవు
నేను దక్క నెవం డింక నెఱుఁగఁగలఁడు. 21

వివ:-ఆ ప్రహర్షాఽప్రహర్షస్వరూపు=సంతోషరూపుఁడును, అసంతోష
రూపుఁడను (నిశ్చలరూపుఁడును) అయిన.

తే. గీ. తనువు లేక నిత్యము గాని తనువులందు
అవికృత మయి మహత్తయి యఖిలమందు
వ్యాపకం బయి యుండెడు నాత్మ నెపుడు
నెదను దలఁచు ధీరుండు శోకింప కుండు. 22

తే. గీ. వేదములు పఠించుటవల్ల మేధవల్ల
అధిక శాస్త్రపాఠమువల్ల నట్టి యాత్మ
పొందరానిది, యెవఁ డాత్మఁ బొందఁ గోరు
వాని కాత్మయె తనమేను ప్రకట పఱచు. 23

తా. ఈ యాత్మ కేవలము వేదములను గ్రహించుటచేతఁగాని ధారణా శక్తిచేతఁ గాని ఎక్కువ శాస్త్రములు చదువుటచేఁ గాని లభింపదు. ఏ యాత్మను సాధకుఁడు గోరునో యట్టియాత్మను గోరు సాధకునికి లభ్యమగును. అట్టి యాత్మను గోరు సాధకునికి ఆ యాత్మయె తన స్వరూపమును వివరించును.

నావిరతో దుశ్చరితా, న్నాశాంతో నాసమాహితః
నాశాంతమనసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ 24

తా. దుశ్చరిత్రనుండి మరలనివాఁడును, శాంతి లేనివాఁడును, నిశ్చలత్వము లేనివాఁడును, చంచలమైన మనస్సు గలవాఁడును ఈ యాత్మను బొందలేరు. దుశ్చరితాదులు లేనివాఁడు బ్రహ్మజ్ఞానము చేతనె దీనిని బొందును.

యస్య బ్రహ్మ చ క్షత్రం చ, ఉభే భవత ఓదనః
మృత్యుర్యస్యోప సేచనం క ఇత్థా వేద యత్ర సః 25

తా. ఏ యాత్మకు బ్రాహ్మణ క్షత్రియుల ధర్మములు ఆహారమగునో మృత్యువు దేనికి ఊరుఁగాయ వంటి దగునో యట్టి యాత్మ యెందుఁ గలదో దానిని దుశ్చరితాదులు లేని జ్ఞాని గాక ఎవఁడు తెలియఁగలఁడు?

ఇతి ప్రథమాధ్యాయే ద్వితీయా వల్లి

---

## అథ

## తృతీయా వల్లీ

ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే
ఛాయాతపే బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యేచ
త్రిణాచికేతాః

తా. ఈ లోకమందు సర్వోత్కృష్ట మగు బ్రహ్మమునకు స్థానమైన హృదయగుహాయందు దున్నట్టియుఁ దాము చేసికొన్న ఫలమును అనుభవించునట్టి జీవుని బ్రహ్మమును నీడ యెండలుగా బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. మూఁడుసార్లు నచికేతాగ్నిని హోమము చేయు గృహస్థులును ఇట్లే చెప్పుచున్నారు.

వివ:_లోకములో గృహాదులను నిర్మించువాఁడు ఇతరములను అప్రధానములుగఁ దలఁచి తన సర్వశక్తులు గృహాది నిర్మాణమునకై ఉపయోగించి అట్టి గృహాదులను బొందునట్లు ఆత్మను బొందఁగోరువాఁడు పశుపుత్రధనాదులకుఁ బ్రాధాన్యము చూపక ఆత్మదర్శనమునకే ప్రాధాన్యము చూపినచో ఆత్మదర్శనమును పొందునని భావము.

కం. చెడునడతనుండి మఱల న
తఁడు, శాంతము లేని యతఁడు తగ నేకాగ్రా
త్ముఁడు గాని యతఁడు చలహృద
యుఁ డాత్మఁ గాంచఁ; డది జ్ఞాని యొకఁడే గాంచున్.

వివ:_చెడునడతలు మొదలగునవి యున్నవాఁడు జ్ఞాని కానేకాఁడు. జ్ఞానికి చెడునడతలు మొదలగు నవగుణము లుండనే యుండవు. కేవల పుస్తక శుష్క జ్ఞానము గలవాఁడు జ్ఞాని కాఁడని భావము.

తే. గీ. బ్రాహ్మమును క్షాత్ర మన్నమై వరలు దేని;
కొగిని మృత్యువు దేనికి నూరుఁగాయ
యగునో యా యాత్మ యెటనుండె; నా విషయము
జ్ఞాని గాక యెవ్వఁ డెఱుంగఁ గలఁడు భువిని.　　　　25

వివ:_ఆత్మకు బ్రాహ్మ క్షాత్రాదులు సాధనములు. ఆ సాధనముల కన్నిటికిని ఆత్మయే ప్రభువని భావము.

ఇది మొదటి యధ్యాయమున రెండవవల్లి.

---

ఇ ౦ క

## మొదటి యధ్యాయమున మూఁడవవల్లి

తే. గీ. ముమ్మరు నచికేతాగ్ని హోమమ్ము చేయు
నేస్తులును బ్రహ్మవిదులు హృద్గేహమందు
నెసఁగి కర్మఫల మనుభవించు బ్రహ్మ
జీవులను నెండ జీవులుగా వచింత్రు.　　　　1

యః సేతు రీజానానా, మక్షరం బ్రహ్మ యత్పరం
అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి 2

తా. యజ్ఞములు చేయు కర్మఠులకు వంతెన వంటిదగు నాచికేతాగ్నిని, నశింప నట్టియు గొప్పదైనట్టియు నిర్భయస్థానమై నట్టియు దాటఁగోరువారికిఁ బారముఁ జేర్చు చున్నట్టియు, నా బ్రహ్మమును దెలిసికొన శక్తుల మగుదుముగాక.

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ. 3

తా. ఆత్మను రథికునిగఁ దెలిసికొనుము. శరీరమును రథముగను దెలిసికొనుము. బుద్ధినైతే సారథిగఁ దెలియుము. మనస్సు పగ్గమని తెలిసికొనుము.

ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః 4

తా. ఈ యింద్రియములు గుఱ్ఱములవంటివనియు, నడచు విషయములు మార్గములనియు, ఇంద్రియ మనస్సులతోఁ గూడిన యాత్మ వానిని అనుభవించు భోక్త యనియు మనీషులందురు.

య స్త్వవిజ్ఞానవాన్ భవ, త్యయుక్తేన మనసా సదా
త స్యేంద్రియా ణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః 5

తా. ఎవఁడైతే నిశ్చలముగాని మనస్సుతో అవివేకియై యుండునో వానికి ఇంద్రియములు లొంగక పొగరు గుఱ్ఱములు సారథినివలెఁ జిక్కు పెట్టును.

య స్తు విజ్ఞానవాన్ భవతి, యుక్తేన మనసా సదా
త స్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః. 6

తా. ఎవఁడు నిశ్చలమైన మనస్సుతో వివేకము గలిగి యింటి యుండు యుండునో వానికి ఇంద్రియములు సారథికి మంచి గుఱ్ఱములు వలె లొంగి సుఖము గూర్చును.

తే. గీ. యాగపరులకు వంతెన యైన నాచి
కేతవహ్ని ని సంసార మాంతలి దరి
పొందఁ గోరువారికి శ్రేష్ఠము నభయపద
మయిన యక్షరబ్రహ్మను నరయఁ గలము. 2

తే. గీ. ప్రథిత కర్మభూమిఁ జరించు రథికుఁ డాత్మ
రథుని వహించుకొనిపోవు రథము తనువు
రథముఁ దిన్నగ నడుపు సారథియె బుద్ధి
సారధికిఁ బగ్గములు మనస్సని గ్రహింపు. 3

తే. గీ. ఈరథము లాగు గుఱ్ఱంబు లింద్రియములు
అవి చరించు భూములు విషయంబు లందు్రు
తనువుతో నింద్రియములతో మనసుతోడ
వెలయు నాత్మను భోక్తగా విబుధు లందు్రు. 4

కం. అనయమ్ము చంచలంబగు
మనసున నెవ్వాఁడు జ్ఞానమహితుఁడుకాఁ డా
తని నింద్రియములు సరకుం
గొన వాసారథిని బొగరుగుఱ్ఱము లటులన్. 5

కం. అనయమ్ము నిశ్చలంబగు
మనసున నెవ్వాఁడు జ్ఞాన మహితుడయా నా
తని నింద్రియములు సరకుం
గొను నాసారథిని మంచిగుఱ్ఱములటులన్. 6

యస్త్వ విజ్ఞానవాన్ భవ త్యమనస్కః సదాఽ శుచిః
న స తత్పద మాప్నోతి సంసారం చాధిగచ్ఛతి. 7

తా. ఎవఁడు లొంగని మనస్సుతో వివేకము లేక యశుచియై యుండునో వాఁడు ఆ పరమపదమును బొందఁడు. చావు బుట్టుకలతోఁ గూడిన సంసారమును గూడఁ బొందును.

యస్తు విజ్ఞానవాన్ భవతి, సమనస్కః సదా శుచిః
సతుతత్పద మాప్నోతి, యస్మా ద్భూయో న జాయతే॥ 8

తా. ఎవఁడు నిశ్చలమనస్సు గలవాఁడై శుచియై యుండునో వాఁడే యా పరమపదమును పొందును. మరల నితఁడు పుట్టఁడు.

విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగ్రహవా న్నరః
సోఽధ్వనః పర మాప్నోతి తద్విష్ణోః పరమం పదం॥ 9

తా. ఏనరుఁడు వివేకబుద్ధి యనుసారథి గలవాఁడై మనస్సనెడు పగ్గములను బట్టుకొన్నవాఁడై యుండునో యతఁడు సంసార మార్గమునకుఁ జివరను బొంది యా వ్యాపనశీలమైన పరబ్రహ్మపదమును బొందును.

ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః
మనసశ్చ పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః॥ 10

తా. ఇంద్రియములకంటె నింద్రియభోగములు గొప్పవి. ఆ భోగములకంటె మనస్సు గొప్పది. మనస్సుకంటె బుద్ధి గొప్పది. బుద్ధి కంటె వ్యాపకమహత్తు చాల గొప్పది. మహత్తు అనఁగా నామ రూపాదులకుఁ గారణమైన హిరణ్యగర్భతత్వము, జీవతత్వము గొప్ప వనగా సూక్ష్మమును శ్రేష్ఠము నని భావము.

మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరాగతిః॥ 11

కం. అనయం బెవఁడు జయింపని
మనమున నశుచియయి జ్ఞానమహితుఁడు కాఁడా
మనుజుఁ డాపరమపదం
బెనయక సంసారమందు నెప్పుడు మునుంగున్. 7

కం. అనయం బెవఁడు జయించిన
మనమున శుద్ధుఁడయి జ్ఞానమహితుఁడెయౌ నా
మనుజుఁడు మఱి యిఁక జన్మం
బెనయక యాపరమపదము నెలమిన్ బొందున్. 8

కం. కని బుద్ధి యనెడు సారథి
మనసను పగ్గమును బట్టి మరలింపఁగ నా
మనుజుఁడు సంసారపుఁ ద్రో
వను దాఁటి గను నల విష్ణు పరమపదంబున్.

తే. గీ. ఇంద్రియములకంటె విషయా లెంతొ గొప్ప
వా విషయములకంటె గొప్పది మనస్సు;
మనసుకంటె గొప్పది బుద్ధి; మఱియు బుద్ధి
కంటె గొప్పది వ్యాపక మగు మహత్తు. 9

వివ:-గొప్పవి = సూక్ష్మమును శ్రేష్ఠము నని భావము. మహత్తు = హిరణ్యగర్భతత్త్వము. జీవతత్త్వము.

తే. గీ. మహతుకంటె నవ్యక్తము మఱియు గొప్ప
దరయ నవ్యక్తమునకన్నఁ బరమపురుషుఁ

తా. మహత్తుకంటె అవ్యక్తము (= నామరూపరహితమై = సర్వ జగత్తులకు బీజరూపముగానున్న శక్తి) గొప్పది. అవ్యక్తముకంటెఁ బరమపురుషుఁడు గొప్పవాఁడు. ఆ పురుషునికంటె గొప్ప దేదియు లేదు. అదే చివరి హద్దు. అదే చివరిగతి.

ఏష సర్వేషు భూతేషు, గూఢోఽఽత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా, బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ 12

తా. ఈ యాత్మ యన్నిప్రాణులలోన గూఢమై యున్నది. కానఁ బైకిఁ ప్రకాశింపదు. ఇది సూక్ష్మదర్శులైన పండితులచే ఏకాగ్రమైన సూక్ష్మమైన బుద్ధిచేఁ జూడఁబడును.

యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే; త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని॥ 13

తా. ప్రాజ్ఞుఁడు వాగాదులైన ఇంద్రియములను మనస్సునందు నియమింపవలయును. ఆ మనస్సును జ్ఞానాత్మ యగు బుద్ధియందును, ఆజ్ఞాన బుద్ధిని జీవాత్మయందును ఆ జీవాత్మను శాంతాత్మయగు పరమాత్మ యందు నిల్పవలయును.

ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ నిబోధత
క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదంతి॥

తా. లెండు, మేల్కొనుఁడు శ్రేష్ఠులైన గురువులను జేరి పరమాత్మను తెలిసికొనుఁడు. పదును పెట్టిన కత్తియందువోలె అది దాఁట రానిది. ఆ యాత్మను సులువుగాఁ బొందరానిదిగాఁ గవులు చెప్పు చున్నారు.

అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం, తథాఽరసం నిత్య
మగంధవచ్చ యత్, అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ ప్రముచ్యతే॥ 15

తా. ఏది శబ్దములేక, స్పర్శలేక, రూపములేక, మాఱుక, రుచిలేక, నిత్యమై గంధము లేక, ఆదియంతములు లేక బుద్ధి మహత్తత్వము

డతిగ గొప్పవాఁడు, పురుషునికన్న గొప్ప
దెదియు లేదు; దదే తుది; మోక్షపదము నదియె. 11

వివ :- అవ్యక్తము = నామరూపరహితమై సర్వజగత్తులకు బీజ
రూపమైనశక్తి.

తే. గీ. ఆత్మ యన్ని ప్రాణులలోన నణఁగియుండుఁ
గావునఁ బరమాత్మయుఁ బైకిఁ గానఁ బడదు
ఆత్మ సూక్ష్మదృష్టి గల పండితులచేత
సూక్ష్మ మేకాగ్రమగు బుద్ధిఁ జూడఁబడును. 12

కం. మనసునను నింద్రియము, లా
మనసును దగ బుద్ధిలోన, మఱి యా బుద్ధిన్
ఘనమహాతునందు, నామహా
తును బరమాత్మంబున విబుధుఁడు నిల్పవలెన్. 13

వివ :- మూలములోని వాక్కు ఇంద్రియముల కుపలక్షణము గాన
ఇట ఇంద్రియము లని వ్రాయఁబడెను.

కం. మఱి లెండు మేల్కొనుఁడు స
ద్గురువులకడ కరిగి తెలిసికొనుఁడు నిజంబున్
మరి యది పదునిడు కత్తి చి
వరవోలె నడుగిడరానిపథ మండ్రు కవుల్. 14

తే. గీ. వినఁబడదు తాకఁబడనిది కనఁబడ దది
మాఱదు, రుచిలేనిది, నశింపనిది గంధ

కంటెను విలక్షణమై యున్నదో యట్టి నిత్యమైన యాత్మను దెలిసికొని జనుఁడు మృత్యుముఖమునుండి విముక్తుఁ డగును

నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనం
ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే॥ 16

తా. యముఁడు చెప్పఁగా నచికేతునిచే వినఁబడిన ప్రాచీనమైన యీ యుపాఖ్యానమును చెప్పినను, విననుగూడ మేధావి బ్రహ్మలోకమందు ఉత్కృష్టుఁ డగును.

య ఇమం పరమం గుహ్యం శ్రావయే ద్బ్రహ్మసంసది
ప్రయతః శ్రాద్ధకాలే వా తదా నంత్యాయ కల్పతే తదానం
త్యాయ కల్పతే॥ 17

తా. ఎవఁడు శుచియై ఈ పరమ రహస్యమైన యుపాఖ్యానమును బ్రాహ్మణుల సభయందుఁ గాని, శ్రాద్ధకాలమందుగాని వినిపించునో వాఁడు అనంతఫలమునకు అర్హుం డగును. అనంతఫలమున కర్హుఁ డగును.

ఇతి ప్రథమాధ్యాయే తృతీయా వల్లీ.

---

అథ

## ద్వితీయోఽధ్యాయః ప్రథమావల్లీ.

పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూ స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్ కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్॥

తా. స్వయంభువు ఆకాశగుణమును గ్రహించు శ్రోత్రము మొదలైన యింద్రియములను శబ్దాదులను గ్రహించుటచేఁ బైపైనె ప్రవర్తించువానినిగ శాసించెను. కాన అవి పైపై విషయములనె గాని లోనున్న యంతరాత్మను జూడలేవు. ఒకానొక ధీరుఁడు మోక్షమును గోరువాఁడై బహిర్విషయములనుండి దృష్టిని మరలించినవాఁడై ప్రత్యగాత్మను (నామరూపాదులకంటె వేఱుగా నున్న యాత్మను) బ్రత్యక్షముగాఁ జూచును.

మలరవిది, యనంత, మనాది, మహాతు గనని
దట్టి నిత్య మాత్మ నెఱింగి మృతిని గనఁడు. 15

కం. యముఁ డిటు వచియింపఁ జెలం
గి మఱెప్పటివో యగు నాచికేతోపాఖ్యా
నము చెప్పిన వినినను నా
సుమతి బ్రహ్మలోక సుగతిని గాంచున్. 16

కం. ఎవఁ డీపరమరహస్యము
సువిదితముగఁ బ్రాహ్మణులకుఁ జొచ్చిన సభలో
ప్రవిమలత శ్రాద్ధమున నై
న, వినుచునో యతండు గను ననంతపదంబున్. 17

ఇది మొదటి యధ్యాయమున మూఁడవవల్లి.

---

ఇం క

## రెండవ యధ్యాయమున మొదటివల్లి.

తే. గీ. ఎవ్వఁడు బైపైనె చరియింప నింద్రియముల
నీశ్వరుండు శాసించెను; నిందుచేత
అవ్వి పైపైనె గను; నంతరాత్మఁ గనవు
వశి యొకఁడె ముక్తికై గనున్ బ్రత్యగాత్మ. 1

పరాచః కామా ననుయంతి బాలా స్తే మృత్యో ర్యంతి
వితతస్య పాశం అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ మధ్రువే
ష్విహ న ప్రార్థయంతే॥

తా. మూర్ఖులు బాహ్య విషయకమైన కోరికలనె పొందుదురు. వారు అంతట నిండిన మృత్యుదేవత యొక్క పాశముచే జిక్కుకొందురు. మఱి జితేంద్రియులు నిత్యమైన మోక్షమును దెలిసికొని యీ లోకమున అనిత్య విషయములందు గోరిక యుంచరు.

యేన రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్
ఏతేనైవ విజానాతి, కి మత్ర పరిశిష్యతే ఏత ద్వైతత్॥ 3

తా. ఈ యాత్మచేతనే రూపమును రసమును గంధమును శబ్దమును దాంపత్య సుఖస్పర్శలను లోకులు తెలిసికొందురు. ఇక్కడ ఆత్మకు దెలియని దింకేమి మిగులును? నీవు తెలియగోరిన యాయాత్మ యిదే.

స్వప్నాంతం జాగరితాంతం చోభౌ మే నానుపశ్యతి
మహాంతం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి. 4

తా. ఏ యాత్మచే స్వప్నములోని వస్తువులను జాగ్రదవస్థలోని వస్తువులను జూచునో యట్టి గొప్పదైన వ్యాపకమైన యాత్మను దెలిసికొని ధీరుడు శోకమును బొందడు.

య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవం మంతికాత్
ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్వై తత్. 5

తా. ఎవడు కర్మఫల మను తేనెను భక్షించుచు జీవరూపమై భూత భవిష్యత్తులకు నియామకుడై యున్న యీ యాత్మను దగ్గఱగా దెలిసికొనునో వాడు ఇట్లు చూచుటవల్ల ఎటనుండియు దన్ను రక్షించుకొనదలపడు. ఆ యాత్మ యదియె.

తే. గీ. జడులు బాహ్యవిషయక వాంఛలను గోరి
వితత మగు మృత్యుపాశాల వేఁగుచుంద్రు
ధీరు లమృతంబు స్థిర మాత్మఁ దెలిసికొనుచు
ఇహమునం దస్థిరములఁ బ్రార్థింప కుంద్రు. 2

కం. జనములు వఱి యెద్దాని వ
లన శబ్ద స్పర్శ రూప రస గంధ రతుల్
గనుదురో యది యీ యాత్మ వ
లన నెః య దెఱుఁగని దేదియుఁ గలదె యది యిదో. 3

టి. వ:-అది=నీవడిగిన యాత్మ ఇదే యని భావము.

కం. కలలో నవి మెలఁకువయం
దలి వస్తువు దేనిచేత నారయ నగునో
యల వ్యాపకము మహాత్తయి
యలరెడు నాత్మఁ గని ధీరుఁ డందఁడు చింతల్.

తే. గీ. కర్మఫలభోక్తయై ప్రాణగతులఁ బూని
భూత వర్తమాన భవిష్యములకు నెపుడు
కర్తయైన యీ యాత్మను గాంచు నెవఁడు
ఆతఁడు తనుఁ గాచుకొనఁ బూనఁ డద్ది యిదియె. 5

యః పూర్వం తపసో జాత, మద్భ్యః పూర్వ మజాయత
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం, యో భూతేభి ర్వ్యపశ్యత ఏతద్వైతత్ ॥ 6

తా. ఎవ్వఁడు జ్ఞానరూప బ్రహ్మము నుండి మొదటనే పుట్టెనో నీళ్ళ కంటె (=నీళ్ళు పంచభూతముల కుపలక్షణము) ముందుగఁ బుట్టెనో హృదయ గుహను బ్రవేశించి భూతములతోఁ పాటు ఉండెనో యట్టి హిరణ్యగర్భ బ్రహ్మను ఎవఁడు చూచునో వాఁడే యీ బ్రహ్మమును జూచును. ఆ యాత్మ యిదే.

యా ప్రాణేన సంభవ త్యదితి ర్దేవతామయీ
గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం యా భూతేభి ర్వ్యజాయత ఏతద్వైతత్.

తా. ఏది పరబ్రహ్మము నుండి హిరణ్య గర్భరూపమైన ప్రాణముగాఁ బుట్టెనో ఏది అన్నిటిని దినునట్టి యదితియో సర్వదేవతలరూపమైనదో ఏది పంచభూతములతోఁ పాటు పుట్టెనో యట్టి యా దేవతను మన హృదయ గుహయందుఁ ప్రవేశించి యున్నదాని నెవఁడు చూచునో వాఁడె బ్రహ్మను చూచును. ఆయాత్మ యిదే.

అరణ్యో ర్నిహితో జాతవేదా, గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః
దివే దివే ఈడ్యో జాగృవద్భి, ర్హవిష్మద్భి ర్మనుష్యేభి రగ్నిః
ఏతద్వైతత్.

తా. గర్భవతులచే గర్భ మందుఁ జక్కఁగాఁ దాల్పఁబడిన గర్భము వలె ఋత్విక్కులచే అరణులందు, ప్రత్తి జమ్మి మొదలగుకఱ్ఱలందు అగ్ని దాఁచఁబడి యున్నది. ప్రతిదినమందు జాగ్రత్త గలిగినట్టియు హవిస్సు (=అగ్నియందు హోమము చేయు నేయి) నొసఁగునట్టి మనుష్యులచే అగ్ని స్తుతింపఁబడునదై యున్నది. ఆ బ్రహ్మము యిదియె.

యత శ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి
తం దేవాః సర్వే అర్పితా స్తదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్. 9

తే. గీ. భూతపంచమునకంటె ముందుగానె
బ్రహ్మమువలన జన్మము నంది స్వాంతగుహను
నలరి భూతంబులంబులందున్న యీ హిరణ్య
గర్భు నెవఁడు గాఁచునో వాఁడె గాంచు దాని. 6

వివ :- హిరణ్యగర్భుఁడు=జీవాత్మ, బంగారమునుండి పుట్టిన కడియములోనగు నవి బంగారమే యైనట్లు బ్రహ్మమునుండి పుట్టిన హిరణ్యగర్భుఁడును బ్రహ్మమె, హిరణ్యగర్భునిఁ జూచిన వాఁడు ఆ పరబ్రహ్మమును జూచునని భావము.

తే॥ గీ॥ ఎవతె దేవతామూర్తియె యెవతె ప్రాణ
గతి గల హిరణ్యగర్భుఁ; డెవ్వతెయు భూత
తతిని గూడి పుట్టెనెది స్వాంతగుహా నుండె
నీయదితిఁ గాంచువాఁడె యయ్యాత్ముఁ గనును. 7

తే॥ గీ॥ గర్భిణులు చక్కఁ దాల్చిన గర్భమట్లు
ఋత్విజులు దాల్ప నరణుల నెసఁగునగ్ని
**అనుదినము** జాగరూకత హవిసు నొసఁగి
ప్రజలు పూజింప వర్ధిల్లు; బ్రహ్మ మిదియె.

వివ :- ఇందు అగ్ని బ్రహ్మముగా నిర్ణయింపఁబడినది, ఋత్విక్కులచే అగ్ని యాగమందు హవిరాదులచేఁ దాల్పఁబడునట్లు యోగులచే బ్రహ్మము హృదయమందుఁ దాల్పఁబడి ధ్యానాదులచే వర్ధిల్లు నని భావము.

తే॥ గీ॥ ఎందునుండి సూర్యుం డుదయించు చుండు
ఎందు సూర్యుండు తా నస్తమించు చుండు

తా. దేనినుండి సూర్యుఁ డుదయించునో, దేనియందు సూర్యుఁ డస్తమించునో యట్టిప్రాణమును సర్వదేవతలు ఆశ్రయించి యుండిరి. దాని నేదియు అతిక్రమింపలేదు. అ బ్రహ్మమిదియె.

యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ
మృత్యోః స మృత్యు మాప్నోతి, య ఇహ నానేవ పశ్యతి. 10

తా. ఏది నామరూపాదులతో నిక్కడ నున్నదో యదే యక్కడ నామ రూపాది రహితమై నిత్యానందమై యున్నది. ఏది యక్కడ ఆ యాత్మ యందున్నదో అదే ఈ నామరూపాది సహితమైన జీవునియందున్నది. మఱొకటి లేదు. ఇట్లు యభిన్నమైన యాత్మను భిన్నముగ నెవఁడు చూచునో వాఁడు చావునుండి చావును పొందును.

మనసై వేద మాప్తవ్యం, నేహ నానాస్తి కించన
మృత్యోః స మృత్యుం గచ్ఛతి, య ఇహ నానేవ పశ్యతి. 11

తా. గురువుచేతను శాస్త్రములచేతను సంస్కరింపఁబడిన మనస్సు చేతనె ఈ బ్రహ్మము పొందఁదగినది. ఇందు భిన్నత్వ మేమియు లేదు. ఎవఁడు ఇందు భిన్నత్వమువలెఁ జూచునో వాఁడు చావునుండి చావును బొందును.

అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి
ఈశానో భూతభవ్యస్య, న తతో విజుగుప్సతే ఏత ద్వైతత్. 12

తా. పరమాత్మ బొటనవ్రేలంత పరిమాణము గలవాఁడై శరీర మధ్యమందు ఉన్నాఁడు. భూతభవిష్యత్తుల కతఁడు ప్రభువు. అతఁడు తాను సర్వము ఒకటే అని అతనిఁ దెలియుటవల్ల తనకంటె నింక వేఱేమియులేదు గాని మఱొకదానివల్ల జనుఁడు దన్నుఁ రక్షించుకొనఁ గోరఁడు. ఆబ్రహ్మమిదియె.

అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతి రివాఽధూమకః
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య సఉశ్వః ఏత ద్వైతత్. 13

ఇట్టిదానిలో దేవత లెల్లఁ గలరు
ఎదియు దాని దాటఁగఁజాల దిదియె బ్రహ్మ. 9

వివ:_ఇట్టిదానిలో=ప్రాణరూపమైన యాత్మలో, దేవతలు=అగ్ని మొద లగు నధిదేవతలు.

కం. ఎది యిటఁ గల దది యట ను
న్నది; యెది యిటఁ గల దది యిట నలరుచు నుండున్
అది యిట వివిధత నెవ్వఁడు
మదిఁ గనునో వాఁడు జన్మమరణము లొందున్. 10

వివ:_జీవాత్మయుఁ బరమాత్మయు నొకటే గాని భిన్నములు గావని భావము.

కం. ఇది మనసుచేత నే పొం
దఁదగిన యది; లేదు భిన్నతత్త్వం బిచటన్
అది యిట వివిధత నెవ్వఁడు
మది గనునో వాఁడు జన్మమరణము లొందున్. 11

కం. పురుషుండు బొటన వ్రేలెడు
మఱి యాపురుషుండు శరీరమధ్య వసించున్
పురుషుఁడు త్రికాలపతి, యా
పురుషునిఁ గనువాఁడు ప్రోవఁబూనఁడు తన్నున్. 12

వివ:_ఇతనిచే సర్వము పూర్ణమై యున్నదిగానఁ బురుషుఁడు అని వ్యుత్పత్తి. ఘటాకాశాది వ్యవహారమువలె హృదయ పరిమాణ మును బట్టి పరమాత్మ బొటనవ్రేలెడు అని చెప్పఁబడెను.

కం. పురుషుండు బొటనవ్రేలెడు
పురుషుఁడు పొగలేని జ్యోతిపోలిక వెలుఁగున్

తా. పరమాత్మ బొటనవ్రేలంత పరిమాణము గలవాఁడు. ధూమము లేని జ్యోతివలెఁ బ్రకాశించును. అతఁడు భూతభవిష్యత్తులకుఁ బ్రభువు. అతఁడే ఇప్పుడు ప్రాణులలో నున్నవాఁడు. రేపును అతఁడే యుండును. ఆ బ్రహ్మము ఇదియే.

యథోదకం దుర్గే వృష్టం, పర్వతేషు విధావతి
ఏవం ధర్మాన్ పృథ క్పశ్యం స్తానే వానువిధావతి. 14

తా. ఎట్లు ఎక్కరాని యెత్తు ప్రదేశమునఁ గురిసిన నీరు పల్లమందున్న పర్వతములందుఁ బడి నశించునో యిట్లే యాత్మలను ప్రతిశరీరమందు వేఱు వేఱుగఁ జూచువాఁడు అనేక శరీరములను బొందును.

యథోదకం శుద్ధే శుద్ధ, మాసిక్తం తాదృగేవ భవతి
ఏవం మునే ర్విజానత, ఆత్మాభవతి గౌతమ. 15

తా. ఓ గౌతముఁడా! ఎట్లు పరిశుద్ధమైన జలమందుఁ గురిసిన శుద్ధమైన నీరు పరిశుద్ధముగనే యుండునో ఇట్లే ఏకత్వజ్ఞానము గలిగి మననశీలుఁడైన వానికి ఆయాత్మ యేకమై యుండును.

ఇతి ద్వితీయాధ్యాయే ప్రథమా వల్లీ.

---

అథ

## ద్వితీయాధ్యాయే ద్వితీయావల్లీ.

పుర మేకాదశద్వార మజ స్యావక్రతేజసః
అనుష్ఠాయ న శోచతి, విముక్తశ్చ విముచ్యతే, ఏతద్వైతత్. 1

తా. పుట్టుకలేని నిత్యము ప్రకాశించు తేజస్సు గల యాత్మకు పదునొకండు ద్వారములు గల శరీరమను పట్నము గలదు. అట్టి యాత్మను జక్కఁగ విజ్ఞాన పూర్వకముగ ధ్యానించినచో శోకము పొందఁడు. అజ్ఞానముచే విడువఁబడి సంసారము నుండి ముక్తిని పొందును. ఆ బ్రహ్మ మిదియె.

పురుషుఁడు త్రికాలపతి; యా
పురుషుఁడె యీనాఁడు రేపు పోలుచుచు నుండున్.

తే॥ గీ॥ ఎక్కరానట్టిచోట్ల వర్షించు నీరు
అడుగుకొండలఁ బడి యణఁగు నట్లు
ఆత్మలను వేఱువేఱుగా నరయు నతఁడు
ఆయయి శరీరములఁ బొంది యణఁగుచుండు. 14

తే॥ గీ॥ స్వచ్ఛ మగు నీటఁ గురిసిన స్వచ్ఛజలము
స్వచ్ఛమై ప్రసన్న మయి యొప్పాఱు నట్లు
గౌతమా! మననమున నేకత్వ మరయు
నతని కేకమై స్వచ్ఛమై యాత్మవఱలు. 15

ఇది రెండవ యధ్యాయమున మొదటివల్లి.

---

ఇంక

## రెండవ యధ్యాయమున రెండవవల్లి.

తే॥ గీ॥ ఈతను వమలజ్యోతియా నీశుపురము
ద్వారములు దానికిఁ గలవు పదునొకండు
తత్పురాధీశుఁ దలఁపఁ జింతలను గనఁడు
మోహబంధములను ద్రెంచి ముక్తిఁగాంచు. 1

వివ :- కనులు రెండు, చెవులు రెండు, నోరు ఒకటి, ముక్కులు రెండు, శిరోరంధ్రము ఒకటి, నాభి ఒకటి, మూత్రద్వారము ఒకటి, గుదద్వారము ఒకటి ఇవి మొత్తము పదునొకండు ద్వారములు.

హంసః శుచిష ద్వసు రంతరిక్షస, ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్
నృషద్వరస దృతస ద్వ్యోమస దబ్జా, గోజా ఋతజా అద్రిజా
ఋతం బృహత్ 2

తా. ఆయాత్మ సూర్యుఁడై యాకాశమునుండి, గాలియై మధ్య భాగమున నుండి, అగ్నియై యజ్ఞవేదియందుండి, అతిథియై యింటిలో నుండి, మనుజులందుండి, దేవతలందుండి, సత్యమందుండి, ఆకాశమునందుండి, నీటిప్రాణులందుండి, భూమియందు ఓషధులందు నుండి, పర్వతాదులందు నద్యాదులుగనుండి యజ్ఞమై యథార్థ రూపమై మహద్రూపమై యుండును.

ఊర్ధ్వం ప్రాణ మున్నయ త్యపానం ప్రత్య గస్యతి
మధ్యే వామన మాసీనం విశ్వే దేవా ఉపాసతే. 3

తా. ఆయాత్మ పైకి, ప్రాణవాయువును నడపును, అపానవాయువును గ్రిందకు నడపును. హృదయమధ్యమం దున్నట్టియు పొలువఁదగినట్టియు నాత్మను సమస్త నేత్రాదింద్రియములు రూపాదులైన గ్రాహ్యద్రవ్యము లొసఁగి యుపాసించును.

అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః
దేహాద్విముచ్యమానస్య, కిమత్ర పరిశిష్యతే ఏతద్వైతత్. 4

తా. శరీరమందున్నట్టియు దేహమునకుఁ బ్రభువయిన యీయాత్మ జారిపోఁగా శరీరములనుండి విడిచి పోఁగా నింక నీ దేహమందేమి మిగులును. ఆబ్రహ్మ మిదే.

న ప్రాణేన నాఽపానేన మర్త్యో జీవతి కశ్చన
ఇతరేణ తు జీవంతి, యస్మి న్నేతా వుపాశ్రితౌ. 5

తా. ఏ మనుష్యుండును ప్రాణవాయువుచేతఁగాని, అపానవాయువు చేతఁగాని జీవింపఁడు. ప్రాణాపానములకంటె విలక్షణమగు నాత్మచేతనే జీవించును. దానినె ప్రాణాఽపానము లాశ్రయించి యున్నవి.

మధు. ఆత్మ యది స్వచ్ఛదివి సూర్యుఁడై మధ్య గాలియగుచు
యజ్ఞ వేది నగ్నిగ, నింట నతిథియై, నరుల సురల
సత్యమున, మింట నలరారి, స్థలజలప్రాణు లగుచు
యజ్ఞమై, నదులయి, సత్యమై మహత్తయి చెలంగు. 2

వివ:_ఆత్మ సమస్తరూపములు గలది గాన ఆయా చోట్ల సూర్యాది స్వరూపముగ నుండు నని భావము.

కం. ఎదపయికిఁ బ్రాణవాయువు
నెద దిగువ నపానవాయు నెంచి నడుపుచున్
ఎదలోన నణఁగి యుండెను
చిదాత్మ నింద్రియము లెల్లఁ జేరి భజించున్. 3

కం. తనువున నుండెడి యాత్మము
చనఁగా, నీతనువు విడిచి జాఱఁగ నిఁక నీ
తనువున నెయ్యది మిగులును
దనువునకున్ భిన్నమౌచుఁ దగు నాత్మ యిదే. 4

కం. ఏతఱి నెవరును బ్రాణము
చేత నపానంబుచేత జీవింపరు గా
నీ తగ వానికి నాశ్రయ
మై తగు నయ్యాత్మచేత మనియెద రిలలో. 5

హంత త ఇదం ప్రవక్ష్యామి, గుహ్యం బ్రహ్మ సనాతనం
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ.

తా. ఓ గౌతముఁడా! ఇప్పుడు నీకు మరల ఈ గూఢమైన యనాది యైన బ్రహ్మమును గూర్చి చెప్పెదను. దేనిని దెలియక పోవుటవల్ల మరణము పొందుచు ఆత్మ యెట్టు సంసారమును బొందునో గూడ చెప్పె దను వినుము.

యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః
స్థాణు మన్యేఽనుసంయంతి, యథాకర్మ యథాశ్రుతం. 7

తా. జీవులు వాని వాని కర్మల ననుసరించియు, వాని వాని విజ్ఞాన మును బట్టియుఁ గొన్ని శరీరములు గ్రహించుటకు యోనిద్వారమును బ్రవేశించును. గొన్ని చెట్లు మొదలగు స్థావరముల భావమును బొందుచు.

య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవాఽమృత ముచ్యతే
తస్మిం ల్లోకాశ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్. 8

తా. ప్రాణేంద్రియములు నిద్రింపఁగా అవిద్యచే నాయా కామము లను గల్పింపఁ జేయుచు నేపురుషుఁడు మేల్కొని యుండునో యతఁడే పరిశుద్ధుఁడు. అదే బ్రహ్మము. అదియె యమృత మనఁబడును. ఆ యా త్మనే లోకములన్నియు నాశ్రయించి యున్నవి. దాని నేదియు నతి క్రమింపలేదు. ఆబ్రహ్మ మిదియే.

అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో, రూపం రూపం ప్రతిరూపో బభూవ
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ.

తా. ఎట్లు అగ్ని యొక్కఁడైనను ఈ లోకమును బ్రవేశించినదై యా యా వస్తువుల రూపములను బట్టి యా యా వస్తు రూపములను బొందునో యట్లే పరమాత్మ యొక్కఁడైనను సర్వప్రాణులలోపల ఉన్నదై వాని వాని రూపములను బట్టి ఆ యా ప్రాణుల యాకార మును బొందును వెలుపలఁ గూడ నట్లే యుండెను.

కం॥ ఇప్పుడు నీకిట గూఢము
నెప్పటిదో యైన బ్రహ్మ నిదె యెఱిఁగింతున్
ఎప్పగిది మృతిని గని స్మృతిఁ
గప్పఁగ నయ్యాత్మ పొడము గౌతమ! వినుమా! 6

తే॥ గీ॥ ప్రాణులవి తాము చేయు కర్మలనుబట్టి
అవి గడించిన జ్ఞానానుభవమువలన
వానిలోఁ గొన్ని యాయాయియోనిఁ బుట్టు
నవియుఁ గొన్ని యాయాయి స్థాణువులఁ బుట్టు. 7

తే॥ గీ॥ ప్రాణములు నింద్రియములు నిద్రను మునుంగఁ
బూరుషుఁడె మేల్కొనును, గోర్కె లూరఁజేసి;
అమల మదె బ్రహ్మ మదె, దాని నమృత మండ్రు
భువనముల కాశ్రియము దాట వెవియు దాని. 8

వివ :- అన్ని యింద్రియములు నిద్రించినను బరమాత్మ సాక్షిగా నుండునని భావము, పరమాత్మ పరిశుద్ధుఁడైనను అగ్నిని బూడిద గప్పినట్లు ఉపాధిని బట్టి కలిగిన యవిద్యచే నావరింపఁ బడునని తెలియునది.

తే॥ గీ॥ ఎటుల నగ్ని యొక్కటె లోక మెల్లఁ జొచ్చి
వస్తువులఁబట్టి వానిరూపంబు నొందె
అట్లె యీయాత్మ యొక్కటె యెల్లప్రాణిలోనఁ
బ్రాణి వెలుపల వానిరూపంబు నొందె. 9

వివ :- అగ్ని యొక్కటైనను, కట్టెలు వత్తి మొదలగు వస్తువులను బొంది వానిరూపములను బొందునట్లు ఆత్మ యొక్కటైనను చీమ మొదలు మనుష్యుఁడు బ్రహ్మాండమువఱకు చీమ మొదలగువాని రూపము పొందు నని భావము.

వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో, రూపం ప్రతిరూపో బభూవ
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా, రూపంరూపం ప్రతిరూపో
బహిశ్చ 10

తా. ఎట్లు గాలి యొక్కటైనను ఈలోకము ప్రవేశించి ఆయా వస్తురూపములను పొందునో అట్లె యాత్మ ఒకటైనను సర్వప్రాణుల లోపల వెలుపల ఆప్రాణుల రూపమును బొందును.

సూర్యో యథా సర్వలోకస్య చక్షు ర్న లిప్యతే చాక్షుషై
ర్బాహ్యదోషైః ఏక స్తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే
లోకదుఃఖేన బాహ్యః 11

తా. శుద్ధాశుద్ధవస్తువులను బ్రకాశింపఁజేయుట మూలమున సమస్త లోకములకుఁ గన్నుగా నుండు సూర్యుఁ డెట్లు అశుద్ధాది వసువులను చూచుటచేఁ గలుగు కంటియొక్క బాహ్యదోషములచే అంటఁబడఁడో అట్లే యన్ని ప్రాణులలోని పరమాత్మ యొక్కఁడైనను లోకుల దుఃఖములచే నంటఁబడనివాఁడై వానికంటె భిన్నుఁడై యుండును.

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా, ఏకం రూపం బహుధా యః
కరోతి త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా; స్తేషాం సుఖం శాశ్వ
తం నేతరేషాం. 12

తా. ఆ పరమాత్మ యొక్కఁడె సర్వము వశపఱచుకొనఁ గలవాఁడు. అన్ని ప్రాణులలోపల నున్నవాఁడు తానొక్క రూపముగనె యుండి యెవఁడు అనేక నామరూపాదులుగఁ జేయుచున్నాఁడో యట్టి శరీరగతుఁడైన పరమాత్మను ఏ ధీరులు చూతురో యట్టి పరమాత్మ స్వరూపులైన వారికె శాశ్వతసుఖము గలుగును. ఇతరులకుఁ గలుగదు.

నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనా మేకోబహూనాం యో
విదధాతి కామాన్ త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషాం. 13

తా. ఏ పరమాత్మ అనిత్యులలో నిత్యుఁడై, చేతనముగలవారిలోఁ జేతనమై యొక్కఁడై యనేకులకుఁ గోరికలను గలిగించు చున్నదో యట్టి హృదయమందలి యాత్మను ఏధీరులు చూతురో వారికె శాశ్వత శాంతి గలుగును. ఇతరులకు శాంతి గలుగదు.

తే. గీ. ఎటుల గాలి యొక్కటె లోక మెల్లఁ జొచ్చి
వస్తువులఁబట్టి వానిరూపంబు నొందె
అట్లె యీయాత్మ యొక్కటె యెల్ల ప్రాణిలోన
బ్రాణి వెలుపల వానిరూపంబు నొందె. 10

నిఖిల జగతికి సూర్యుండు నేత్ర మయ్యు
నెట్లు నేత్రదోషాదుల ముట్టఁబడఁడొ
యటులె యీయాత్మ యొక్కటె యెల్లప్రాణిఁ దనరి
భువన దుఃఖంబు లంటక యవల నుండు. 11

వివ:- ఉన్నది త్రాడొక్కటే యైనను త్రాటిని త్రొక్కి పాము అనుకొని మూర్ఛాదులను జనులు బొందునట్లు అవిద్యచే ఆత్మను కాంతా కనకాది ప్రపంచముగఁ దలఁచి సుఖదుఃఖ జన్మమరణాది దుఃఖములను బొందుచున్నారని భావము.

తే. గీ. ఈశుఁ డొకఁడు సర్వనియంత యెల్లఁ గలఁడు
ఒక్క రూపొంది పలురూపు లొనరఁ జేయు
నట్టి హృదయస్థుఁ బరమాత్ము నరయు బుధుల
కొక్కరికె శాశ్వతసుఖ మన్యులకు గాదు. 12

వివ:- అద్దము మొదలగు వానియందు ముఖాదులు ప్రతిబింబరూపముగ నున్నట్లు హృదయమందుఁ బరమాత్మ ప్రతిబింబరూపముగ నుండెను గానఁ బరమాత్మకు హృదయము ఆధారముగాదు.

తే. గీ. నిత్యుఁడై యనిత్యులను, జ్ఞానియయి జ్ఞాను
లందు, నొకఁడె యందఱకుఁ గామ్యంబు లిచ్చు
నట్టి హృదయస్థుఁ బరమాత్ము నరయు బుధుల
కొండె శాశ్వతశాంతి యన్యులకుఁ గాదు. 13

వివ:- పరమేశ్వరుఁడు జీవులకు వారివారి కర్మలనుబట్టియు తనకు వారిపైఁ గలిగిన యనుగ్రహమును బట్టియుఁ గోరిక లిచ్చునని భావము.

నాచికేతా:

త దేత దితి మన్యంతేఽనిర్దేశ్యం పరమం సుఖం
కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా. 14

తా. ఇట్టిదని సామాన్యులు తెలపలేని యీ పరమానంద రూపమును గూర్చి "అది యిటువంటి" దని ధనపుత్రాదీష్యణాలను విడిచిన యతులు తలఁచుచున్నారు. అది స్వయముగఁ బ్రకాశించునో లేక మన బుద్ధిగోచరమై స్పష్టముగఁ గనుఁడునో దాని నెట్లు తెలియఁగలను.

యమః:

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం; నేమా విద్యుతో భాంతి
కుతోఽయ మగ్నిః తమేవ భాంత మనుభాతి సర్వం, తస్య భాసా
సర్వ మిదం విభాతి. 15

తా. ఆ బ్రహ్మసమీపమున సూర్యుఁడు వెలుఁగఁడు. చంద్రుఁడు నక్షత్రములు వెలుఁగవు. ఈ మెఱపులు మెఱయవు. ఈ అగ్ని యెట్లు వెలుఁగును. ఆ బ్రహ్మ ప్రకాశింపఁగా దాని ననుసరించి సర్వము వెలుఁగును. దాని ప్రకాశముచే నిది యంతయుఁ బ్రకాశించుచున్నది. (ఇది పై సందేహమునకు సమాధానము).

ఇది ద్వితీయాధ్యాయే ద్వితీయావల్లీ.

---

అథ

## ద్వితీయాధ్యాయే తృతీయావల్లీ.

ఊర్ధ్వమూలోఽవాక్శాఖః ఏషోఽశ్వత్థః సనాతనః
తదేవ శుక్రం తద్బ్రహ్మ, తదేవాఽమృత ముచ్యతే॥
తస్మింలోకాః శ్రితాః సర్వే, తదు నాత్యేతి కశ్చన ఏతద్వై తత్. 1

తా. పైనున్న విష్ణుపదము మూలముగఁ గలదై, క్రిందనున్న స్వర్గ నరకాది లోకములు కొమ్మలుగఁ గలదై యున్న యీ సంసార మనెడి

నాచికేతుఁడు:

తే॥ గీ॥ ఇట్టిదని యట్టిదని నిరూపింపరాని
పరమసుఖమూర్తిఁ బరమాత్మ బ్రహ్మవిదులు
"అదియె యిది" యందు; రానంద మది తనంత
మెఱయునో మఱిఁ గన్పడునో యెట్లెఱుఁగ నేర్తు. 14

యముఁడు:

మధు॥ అచట సూర్యుఁడును వెలుంగఁ డచటఁ జంద్రుఁడు వెలుఁగఁడు
ఆచట నక్షత్రములు వెల్గ; వచట నీమెఱపు మెఱయ
దచట నీయగ్ని యేపాటి; దది వెల్గ దానిఁబట్టి
యిచట నెల్ల వెల్గును; సర్వ మిది దానికాంతి వెలుఁగు.

వివ :– సూర్యచంద్రనక్షత్రాదులు ఆబ్రహ్మను బ్రకాశింపఁజేయ లేవు. అదియె అన్నిటిని బ్రకాశింపఁ జేయును. ఆయాత్మ స్వయముగను బ్రకాశించును. నిష్కామము నిశ్చలము నగు బుద్ధికిని గ్రాహ్యమగు నని భావము.

ఇది రెండవ యధ్యాయమున రెండవవల్లి

---

౩ ౦ క

## రెండవ యధ్యాయమున మూఁడవవల్లి

తే॥ గీ॥ ప్రాఁత దెప్పటిదో యిది యశ్వత్థతరువు
పయిని మొదలు, కొమ్మలు క్రిందఁ బరఁగు; దాని
కాది యాత్మ శుద్ధము బ్రహ్మ మమృతమదియె
యిదియె లోకాశ్రయము; దాఁట వెవియు దాని. 1

యశ్వత్థవృక్షము ప్రాచీనమైనది. ఈ సంసార వృక్షమునకు మూలమైన యాత్మను సర్వలోకములు ఆశ్రయించి యున్నవి. ఆ యాత్మనేదియు అతిక్రమింపలేదు ఆ బ్రహ్మ మిదియె.

యదిదం కించ జగత్ సర్వం, ప్రాణ ఏజతి నిఃసృతం
మహద్భయం వజ్ర ముద్యతం య ఏత ద్విదు రమృతాస్తే
భవంతి. 2

తా. ప్రాణరూపముగు బ్రహ్మ మున్నప్పుడే యీ సూర్యచంద్రగ్రహనక్షత్రాది రూపమైన జగమంతయు బయలుదేఱి నియమముగాఁ గదలుచున్నవి. అది వజ్రధరునివలె మహాభయంకరమైనది. దానిని దెలిసినవారు మరణము లేనివారగుదురు.

భయా దస్యాఽగ్ని స్తపతి, భయా త్తపతి సూర్యః
భయా దింద్రశ్చ వాయుశ్చ, మృత్యు ర్ధావతి పంచమః

తా. ఈపరమేశ్వరునిభయమువలన అగ్ని మండును. ఇతనిభయమువలన సూర్యుఁడు తపించును, ఇతనిభయమువల్ల ఇంద్రుఁడును వాయువును అయిదవ మృత్యుదేవతయును తమతమ పనులు చేయుదురు.

ఇహ చేదశక ద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః
తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే

తా. ఈశరీరము పడిపోక మునుపె యీలోకమందు జీవించుచునె యీబ్రహ్మమును దెలిసికొనలేక పోయినచో జనులు భూలోకాదులందు శరీరమును ధరింప వలసివచ్చును.

యథాఽఽదర్శే తథాత్మని
యథా స్వప్నే తథా పితృలోకే.

తా. లోకులు నిర్మలమైన యద్దమందు తమ ప్రతిబింబమును జూచుచున్నట్లు నిర్మలమైన బుద్ధిలో నాత్మను జూడవలయును. కలలో జాగ్రద్వాసనను బట్టి గనిపించు వస్తువులు నిశ్చలముగ నుండనట్లు పితృలోకమున ఆత్మదర్శనము నిశ్చలముగ నుండును.

వివ :- అశ్వత్థము=శ్వ=రేపు, స్థము=ఉన్నది. శ్వత్థము, రేపు లేనిది అశ్వత్థము. సంసారము రావిచెట్టువు. ఇందు సంసారము రావిచెట్టుగాఁ బోల్పఁ బడినది. దానికిఁ బయినున్న విష్ణుపదము మొదలు, క్రిందిలోకములు కొమ్మలు.

తే॥ గీ॥ అన్నిటికిఁ బ్రాణ మగు బ్రహ్మ మున్నయపుడె
యీ జగం బెల్లఁ బ్రాదుర్భవించి మెదలు
వజ్రధరునిపోలిక మహాభయదుఁ డతఁడు
అమృతులై యుందు రీబ్రహ్మ నరయువారు. 2

తే॥ గీ॥ ఇతనిభయమున నాయగ్ని యెపుడు మండు
ఇతని భయమున సూర్యుండు నెపుడు వెలుఁగు
ఇతని భయమున గాలియు నింద్రుఁడుంద్రు
ఇతని భయమున మృత్యుదేవత చరించు. 3

తే॥ గీ॥ తనువు వదలక ముందె యీ తనువుతోనె
బ్రహ్మము నెఱుంగఁ గలఁడేని బంధముక్తిఁ
గాంచు; నా బ్రహ్మము నెఱుంగఁ గాంచఁడేని
ప్రాణి లోకంబుల శరీరబద్ధుఁడగును. 4

తే॥ గీ॥ స్వచ్ఛమగు నద్దమున మోము నరయునట్లు
స్వచ్ఛమగు బుద్ధిలో నాత్మ నరయ నగును
కలను వస్తులు స్ఫుటముగఁ గనఁబడ నటు
కనఁబడ దలయాత్మ పితృలోకమున స్ఫుటత. 5

యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వలోకే
ఛాయాతపయో రివ బ్రహ్మలోకే 6

తా. ఎట్లు నీటియందు మోము మొదలగునవి వాని అవయవములు విడిగాఁ గాక కలిసి యస్ఫుటముగఁ గనిపించునో యట్లె గంధర్వలోకమున ఆత్మ యస్ఫుటముగఁ గనిపించును. నీడ యెండలందువలె బ్రహ్మలోకమందు ఆత్మ స్పష్టముగఁ గన్పడును.

ఇంద్రియాణాం పృథగ్భావ, ముదయాస్తమయౌ చ యత్
పృథగుత్పద్యమానానాం, మత్వా ధీరో న శోచతి 7

తా. ఆత్మకంటె వేఱుగఁ దమతమకారణములైన యాకాశాదులనుండి విడివిడిగఁ బుట్టిన శ్రోత్రాదీంద్రియములు ఆత్మకంటె వేఱుగా నుండుటను అవి మేల్కొన గాంచి యుదయించుటను, నిద్రపొంది యస్తమించుటను తలంచి ఆత్మకు ఉదయాస్తమయములు లేవని యుఁ దలఁచి ధీరుఁడు విచారమును బొందఁడు.

ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్వ ముత్తమం
సత్వా దధి మహానాత్మా, మహతోఽవ్యక్త ముత్తమం 8

తా. ఇంద్రియములకంటె మనస్సు గొప్పది. మనస్సుకంటె బుద్ధి గొప్పది. బుద్ధికంటె మహత్తు గొప్పది. మహత్తుకంటె అవ్యక్తము గొప్పది.

అవ్యక్తాత్తు పరః పురుషో, వ్యాపకోఽలింగ ఏవ చ
యం జ్ఞాత్వా ముచ్యతే జంతు రమృతత్వం చ గచ్ఛతి 9

తా. అవ్యక్తముకంటెను బరమపురుషుఁడైన పరమాత్మ గొప్పవాఁడు. ఎవనిని దెలిసికొని జీవుఁడు అవిద్యనుండి ముక్తుఁడై మోక్షమును బొందునో యాపరమాత్మ యాకాశముకంటెను వ్యాపకుఁడు. సర్వసంసార ధర్మములు లేనివాఁడు.

న సందృశే తిష్ఠతి రూప మస్య న చక్షుషా పశ్యతి కశ్చ నైనం
హృదా మనీషా మనసాఽభిక్లృప్తో, య ఏతద్విదు రమృతా
స్తే భవంతి.

తే. గీ. నీటఁ గదలుచు మోము గన్పించునట్లు
గానిపించు గంధర్వలోకమున నాత్మ;
నీడ నెండ వస్తువులు గన్పించునట్లు
బ్రహ్మలోకాన నాత్మ కన్పడును స్ఫుటత. 6

తే. గీ. పంచభూతాల వేర్వేఱు ప్రభవ మంది
యింద్రియము లాత్మనుండి భేదించుటయును
అవి జనించుటయును నాశ మొందుటయును
నెఱచి మదిని ధీరుండు శోకింపఁ డెపుడు. 7

తే. గీ. ఇంద్రియములకంటె మన స్సెంతొ ఘనము
మనస్సుకంటె బుద్ధియె యుత్తమంబు, బుద్ధి
కంటెను మహాత్మె యుత్తమ, మామహాత్తు
కంటె నవ్యక్త ముత్తమ మయి యెసంగు. 8

తే. గీ. మఱియు నవ్యక్తమునకన్నఁ బరమపురుషుఁ
డుత్తముఁడు వ్యాపకుఁడును సర్వోత్తముండు
అతని కెట్టిధర్మములు లే వతనిఁ దెలియు
ప్రాణి బంధముక్తిని గాంచు నమృతుఁ డగును. 9

తే. గీ. మఱి యితని రూపు దృష్టిగోచరము గాదు
ఎవఁడు నీయాత్మఁ గంట నీక్షింప లేఁడు

తా. ఈ యాత్మ యొక్క రూపము దృష్టిగోచరము గాదు. ఎవఁడును దీనిని గంటితోఁ జూడలేఁడు. సంకల్పరూప మగు మనస్సును నియమించు హృదయముచేతను మననరూపమైన సమ్యగ్దృష్టితోడఁ జూడఁ బడఁగాఁ బ్రకటమగును. దీనిని దెలిసినవారు అమృతు లగుదురు.

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ న విచేష్టతి, తా మాహుః పరమాం గతిం. 11

తా. ఎప్పుడు జ్ఞానేంద్రియము లైదును దమతమ విషయములనుండి మరలినవై యంతఃకరణముతోఁ గూడి యుండునో బుద్ధియును దన వ్యాపారములందుఁ బనిచేయదో యట్టిస్థితిని పరమగతిగాఁ జెప్పుదురు.

తాం యోగ మితి మన్యంతే, స్థిరా మింద్రియధారణాం
అప్రమత్త స్తదా భవతి, యోగో హి ప్రభవాప్యయౌ. 12

తా. బాహ్యేంద్రియములను లక్ష్య మగు బ్రహ్మమందు స్థిరముగ నిల్పుటను యోగ మని యోగులు తలఁచుచున్నారు. ఆ ధ్యానకాలమందు యోగి యప్రమత్తుఁ డగును. ఆ యోగము పుట్టుచును అపాయమొందుచును ఉండుటయె ధర్మము గలదిగదా.

నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే. 13

తా. ఆ యాత్మ వాక్కుచేఁ బొందరానిది. మనస్సుచేఁ దలఁపరానిది. కంటిచేఁ జూడరానిది. ఆత్మ యున్నదని నమ్మి నిశ్చల హృదయమున భావించెడి యాస్తికునకె గాని యదిలేదని నమ్మి నిశ్చలహృదయమున భావింపని నాస్తికుని కెట్లు పొందఁదగి యుండును.

అస్తీత్యే వోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః
అస్తీత్యే వోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి. 14

తా. బుద్ధిమొదలగు నుపాధులుగల యాత్మ యున్నదని యొగ్రహింపవలయును. బుద్ధి మొదలగు నుపాధులు గల సోపాధి రూపముగను ఉపాధులు లేని నిరుపాధి రూపముగను తత్త్వమును భావించి గూడ ఆత్మను

ధ్యానమున వికల్పము లేని యమలబుద్ధి
నది స్ఫుట మగు; దీనిఁ గనువా రమృతులగుదు. 10

తే. గీ. యెప్పుడు విషయాళివైపు జ్ఞానేంద్రియములు
నడవక మరలి హృదిని లీనంబు లగునో
బుద్ధి పని మాని యాత్మలో మునుక లిడునొ
యదియె యుత్తమగతి యని యండ్రు బుధులు. 11

తే. గీ. ఇంద్రియముల స్థిరముగ ధరించి యుంట
యోగ మనియందు రాయోగ మొదవు నప్పుడు
యోగి యప్రమత్తుఁ డగు నాయోగ మెప్పుడుఁ
బుట్టుచు నపాయ మొందుచుఁ బొడలుఁ గాదె. 12

వివ:- యోగ మొకపుడు పుట్టుచుఁ బుట్టక చెడిపోవుచు నుండును గాన యోగి యప్రమత్తుఁడై యుండవలయు నని భావము.

ఆ. వె. మాటచేతఁ గాని మనసుచేతను గాని
కనులచేతఁ గాని కనఁగరాదు
ఆత్మ యున్న దనెడి యాస్తికులకె గాని
నాస్తికులకు నెట్టు లది లభించు. 13

వివ:- ఆత్మ నామరూప రహితముగాన హృదయ గ్రాహ్యమె గాని బాహ్యేంద్రియ గ్రాహ్యముగాదు. అందుచే అది యితరులకుఁ జూపరానిదని భావము.

తే. గీ. తాను సోపాధి నిరుపాధి తత్త్వచింత
ఉన్న దని నమ్మయే యత్న మూన వలయు

గ్రహించవలయును. నామరూపరహిత మగు ఆత్మ బాహ్యేంద్రియ గ్రాహ్యముగాదు, అంతరింద్రియ గ్రాహ్యమగును. కాన ఆత్మదర్శులు చెప్పిన దానిని బట్టి ఆత్మ యున్న దనియె గ్రహించు వానికి ఆత్మతత్త్వ స్వరూపము అభిముఖ మగునని తెలియునది.

యదా సర్వే ప్రముచ్యంతే కామా యస్య హృది స్థితాః
అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమనుశ్నుతే. 15

తా. ఎవని మనస్సునం దున్న కోరిక లన్నియు ఎప్పుడు విడిపోవునో అప్పుడు మరణ స్వభావముగల మనుష్యుఁడు అమృతుఁడై యిక్కడనె బ్రహ్మమును పొందును.

యదా సర్వే ప్రభిద్యంతే, హృదయ స్యేహ గ్రంథయః
అథ మర్త్యోఽ మృతో భవ త్యేతావ ద్ధ్యనుశాసనం. 16

తా. ఎప్పుడు ఈ జన్మమందే హృదయమందలి యవిద్యవలని ముడులు ఊడిపోవునో యప్పుడు మర్త్యుఁడు అమృతుఁ డగును. ఇదే సర్వ వేదాంతముల యుపదేశము.

శతం చైకా చ హృదయస్య నాడ్య
స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా
తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి. 17

తా. హృదయము నుండి వెడలిన నాడులు నూటయొక టున్నవి. అందులో సుషుమ్న అను నాడి యొకటి తలను జీల్చుకొని పైకి వెడలి వచ్చినది. ఆనాడితోఁ బైకి సూర్యద్వారముగుండ వెళ్లువాఁడు బ్రహ్మ లోకము పొంది అమృతత్వమును బొందును. మిగిలిన వైపుగా వెడలిన తక్కిన నాడులు చావుఁ బుట్టుకలకె యగును.

ఉన్నదని నమ్మి యే యత్న మూనువాని
కాత్మతత్త్వ మది యనుగ్రహంబు సూపు   14

వివ :- అగ్నిని బైకిఁ గనిపింపఁజేయు కట్టెలు మొదలగు వానిని ఉపాధులందురు. ఇట్లే ఆత్మను గనిపింపఁజేయు శరీరములు ఉపాధులు. అవి గలది సోపాధి, అవి లేనిది నిరుపాధి.

తే. గీ. హృదయమునఁ బాదుకొని యున్న యిచ్ఛ లెల్ల
మఱఁగునో యెప్పు, డానాఁడె మర్త్యు లెల్ల
మరణ మొందక యమృతులై వఱలుచుంద్రు
వార లిచటనె బ్రహ్మంబుఁ బడయఁ గలరు.   15

తే. గీ. హృదయమును దృఢముగను బంధించియున్న
యెల్ల ముడులును జీవించు నెడనె యెపుడు
ఊడునో నాఁడె యమృతత్వ మొందు నరుఁడు
తెలియు సర్వవేదాంతోపదేశ మిదియె.   16

తే. గీ. నూఱు నొకటి నాడులు హృదినుండి వెడలె
నందుఁ దలఁ జీల్చి చను సుషుమ్నాఖ్య నాడి
దానిగుండఁ బైఁ జన నమృతత్వ మొందు
నన్యనాడులు సంసార మందె ముంచు.   17

వివ :- ప్రాణాయామాది యోగసాధనలద్వారా ఆ సుషుమ్నా నాడిని మేల్కొల్పి చివరి కాలమున హృదయమందు ఆత్మను వశపఱచుకొని యానాడితోఁ గలుపవలయును. అట్లు కలిపి దానిగుండఁబోయి సూర్యమండలముద్వారా బ్రహ్మలోకము పొంది యమృతుఁ డగు నని భావము.

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సంనివిష్టః
తం స్వాచ్ఛరీరా త్ప్రవృహే న్ముంజా దివేషీకాం ధైర్యేణ
తం విద్యా చ్ఛుక్ర మమృతం తం విద్యా చ్ఛుక్ర మమృత మితి.

తా. బొటనవ్రేలంత పరిమాణముగల పురుషు డంతరాత్ముఁడై యెల్లప్పుడు జనుల హృదయమందు నిలిచి యుండును. దర్భనుండి పోఁచను వలెఁ బ్రమాదము లేకుండఁ దన శరీరమునుండి యాత్మను వేఱుచేయవలెను. ఆ యాత్మను శుద్ధమైన దానినిగను, అమృతమైన దానినిగను దెలియవలెను. ఆ యాత్మను శుద్ధమైన దానినిగను, అమృతమైన దానినిగను దెలియవలయును.

మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా
విద్యా మేతాం యోగవిధిం చ కృత్స్నం
బ్రహ్మప్రాప్తో విరజోఽభూ ద్విమృత్యు
రన్యోఽ ప్యేవం యో వి దధ్యాత్మ మేవ. 19

తా. మఱి యిట్లు మృత్యుదేవతచేఁ జెప్పఁబడిన యీ విద్యను సమస్తమైన యోగవిధిని పొంది నాచికేతుఁడు బ్రహ్మమును బొందినవాఁడై రాగద్వేషాది దోషములు లేనివాఁడై మరణము లేనివాఁడయ్యెను. ఇట్లే యధ్యాత్మ తత్త్వమును దెలిసికొన్న యితరుఁడుగూడ బ్రహ్మమును బొంది మరణము లేనివాడగును.

ఓమ్ శాంతి మంత్రః

సహ నా వవతు సహనౌ భునక్తు సహ వీర్యం కరవావహై......

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇతి ద్వితీయాధ్యాయే తృతీయావల్లీ.

కఠోపనిషత్ సమాప్తా.

మధు. బొటనవ్రేలంత యంతరాత్ముఁడు పురుషుండు జనుల
హృదయమున నెప్పుడు వసించు; నీక మేనినుండి యతని
దర్భనుండి తోచను బోలెఁ దరలింపవలయు ధృతిని
తెలియు స్వచ్ఛ మమృతమది తెలియు స్వచ్ఛ మమృతమది.

వివ :- నామరూప శరీరాదులు లేకయు శరీరములోపల విహితుండై యున్న యాత్మను శరీరాదులకంటె వేఱుగ భావించి యా శుద్ధ, బుద్ధ, చిదానంద స్వరూపముగల యాత్మను దర్శించి మోక్షము పొందవలయునని భావము.

తే. గీ. యముఁడు వచింప నీవిద్య నఖిల యోగ
విధిని నాచికేతుఁడు యథావిధి గ్రహించి
మోహమును వీడి బ్రహ్మమై ముక్తిఁ గాంచె
నెవ్వఁ డధ్యాత్ముఁ గను, వాఁడు నిటులె గాంచు. 19

వివ :- ధనధాన్య రాజ్యాది భూలోక భోగములు, అప్సరస్ స్త్రీ భోగాది సర్వ భోగములును స్వల్పకాలమె యుండు ననియు అప్పటికి మాత్రమే సుఖకరములనియు దలఁచి, నచికేతుఁడు శాశ్వతమును అత్యంతానందకరము నగు నాత్మను బొందినట్లు జనులు స్వల్పము లగు నైహికాముష్మిక భోగములను బరిత్యజించి శాశ్వతానంద కరమగు నధ్యాత్మతత్త్వమును బొందవలయునని తెలియునది.

ఓమ్ శాంతి మంత్రము
మమ్మాత్మశుఁ డేలుతెన్ మముఁ బెంచుఁ గావుతెన్......
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః
ఇది శ్రీ చర్ల నారాయణశాస్త్రి జనకగురువర, కరుణాలబ్ధ
విద్యుఁడును వెంకమాంబా పుత్రుఁడును నగు గణపతిశాస్త్రిచేఁ
దెనిఁగింపఁబడిన కఠోపనిషత్తునందు ద్వితీయాధ్యాయమున మూడవవల్లి

సమాప్తము.

---

# ఉపనిషత్సుధా

# ప్రశ్నోపనిషత్

(అథర్వ వేదాంతర్గతా)

## ప్రథమః ప్రశ్నః

### శాంతిమంత్రః

ఓమ్.

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యే మాఽక్షభి ర్యజత్రాః,
స్థిరై రంగై స్తుష్టువాంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః.

దేవతలమగుచు మేము చెవులచే శుభము వినుదుముగాక. యజ్ఞశీలురమైన మేము కన్నులచే శుభమును జూతుముగాక. స్థిరమైన యంగములతో శరీరము లనెడి మంత్రములతో మిమ్ము స్తుతించుచు దేవులు ప్రసాదించిన దీర్ఘాయువును బొందుదుము గాక.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

బృహస్పతి మొదలగు పెద్దల యొద్ద వినెడి యింద్రుఁడు మాకు శుభము గలుగఁ జేయుఁగాక. సర్వమును దెలిసిన సూర్యుఁడు మాకు శుభ మిచ్చుఁగాక. అహింసాపాలకుఁడైన గరుత్మంతుఁడు మాకు శుభ మిచ్చుఁగాక.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః.

# ఉపనిషత్సుధ

# ప్రశ్నోపనిషత్తు

(అథర్వ వేదములోనిది)

## మొదటి ప్రశ్నము.

### శాంతిమంత్రము, దండకము.

ఓమ్

చెవులచే భద్రముల్ విందు మాదైవభావంబులన్ బొందుచున్
గండ్లతో భద్రముల్ చూతు మాయజ్ఞశీలంబుతో, నిశ్చలం
బైన యంగంబులన్ దేహమంత్రాలతో స్తోత్రముల్ చేతు;
మెల్లప్పు, దేవుల్ ప్రసాదించు దీర్ఘాయువుల్ గల్గుతన్ మా కిలన్

మాకున్ శుభం బిచ్చుతన్ పెద్దలన్ భక్తి నాలించు
నింద్రుండు; మాకున్ శుభం బిచ్చుతన్ సర్వవేదుండు
సూర్యుండు; మాకు న్నహింసా పక్షుండో గరు
త్మంతుఁ డిచ్చున్ శుభంబుల్; సురాచార్యుఁ
డిచ్చున్ శుభంబుల్ సదా.

ఓమ్

శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్

సుకేశా చ భారద్వాజః, శైబ్యశ్చ సత్యకామః
సౌర్యాయణీ చ గార్గ్యః, కౌసల్యశ్చాశ్వలాయనో, భార్గవో వైదర్భిః
కబన్ధీ కాత్యాయన స్తే హైతే బ్రహ్మపరాః ౧

భరద్వాజ కులమునందుఁ బుట్టిన సుకేశుఁడును, శిబికులమునందుఁ బుట్టిన సత్యకాముఁడును, సూర్యవంశమందలి గార్గ్యుండును, అశ్వల కులస్థుండగు కౌసల్యుఁడును, భృగువంశస్థుఁడగు వైదర్భియు, కాత్య వంశస్థుఁడగు కబంధియును బ్రహ్మమందు ఆసక్తులై

బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాఽన్వేషమాణా ఏష హ వై తత్సర్వం
వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవన్తం పిప్పలాదముపసన్నాః ౨

బ్రహ్మమందు శ్రద్ధ గలవారై పరబ్రహ్మమును వెదకఁగోరి యీ పిప్పలాదుఁడే అది యంతయుఁ జెప్పునని వారు దర్భలు చేతఁ బూని భగవంతుఁడైన పిప్పలాద మహర్షి దగ్గఱకు వచ్చిరి.

తాన్ స ఋషి రువాచ భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా
సంవత్సరం సంవత్స్యథ యథాకామం ప్రశ్నాన్ పృచ్ఛత
యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ ఇతి॥ ౩

అపుడు వచ్చినవారితో ఆముని యిట్లనియె. "తిరిగి తపస్సుతో బ్రహ్మచర్యముతో శ్రద్ధతో ఒకయేఁడు ఉండుఁడు. తిరిగి వచ్చి మీ యిష్టము వచ్చినట్లు ప్రశ్న లడుఁగుఁడు. మాకుఁ దెలిసినచో అంతయు మీకుఁ జెప్పెదము" అని.

అథ కబన్ధీ కాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ
భగవన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయన్త ఇతి. ౪

సంవత్సరమైన పిదప కాత్యవంశస్థుఁడగు కబంధి వచ్చి యడిగెను.
"ఓ భగవంతుఁడా! ఈ ప్రాణులన్నీ దేనినుండి పుట్టుచున్నవి" అని

ఓమ్



మధు. క్షితి భరద్వాజకులుఁడు సుకేశుఁడు, శిబికులుఁడు
సత్యకాముఁడు, సూర్యవంశజుఁడు గార్గ్యుఁడు, నశ్వ
లజుఁడు కౌసల్యుఁడు, భృగుకులజుఁడు వైదర్భి, కాత్య
వంశ్యుఁడు కబంధి యను వీరు బ్రహ్మపరాయణు లయి 1

ఈ యుపనిషత్తులో సుకేశుఁడు మొదలగువారు పిప్పలాదుని నడిగిన ప్రశ్నలు, వానికి సమాధానములు గలవు. ప్రశ్నలను బట్టి ప్రశ్నోపనిషత్తు అని దీనికిఁ బేరు గలిగినది.



తే. గీ. బ్రహ్మనిష్ఠులై మఱి పరబ్రహ్మ వెదకఁ
దలఁచువారలై యిదెల్ల నీలండు ప్రకట
పఱచు నంచు దర్భపవిత్రపాణు లయి వె
డలిరి భగవానుఁడౌ పిప్పలాదుకడకు. 2



తే. గీ. వారి కా ముని యనె "నింక మీరు తపము
సలుపుచున్ బ్రహ్మచారులై శ్రద్ధతోడ
వత్సరం బుండుఁడు; యథేచ్ఛఁ బ్రశ్న లడుగఁ
డెఱుఁగుదుమయేని మీ కెఱిఁగింతు మెల్ల॥ 3

"మాకుఁ దెలిసినచోఁ జెప్పెదము" అని పిప్పలాదుఁడు వినయమునకై చెప్పె నని తెలియవలయును.

కం. ఆయేడాది పిదపఁ గా
త్యాయనుఁడు కబంధి వచ్చి తగ నిట్లనియెన్
ఓయి మహాత్మ! యయిన మఱి
యీయీప్రజ లెందు జన్మ మందెద రనఁగన్॥ 4

తస్మై స హోవాచ ప్రజాకామో వై ప్రజాపతిః స తపోఽతప్యత
స తప స్తప్త్వాస మిథున ముత్పాదయతే రయిం చ ప్రాణం
చే"త్యేతౌ మే బహుధా ప్రజాః కరిష్యతః" ఇతి. 4

ఆ పిప్పలాదుఁ డాకబంధి కిట్లనియె "ప్రాణులను సృజింపఁదలఁచిన యా ప్రజాపతి సంకల్పించెను. అతఁడు సంకల్పించి ఇవి నాకు అనేక విధ ప్రాణులను సృజించునని తలఁచి అన్నము ప్రాణము అను జంటను సృజించెను.

ఆదిత్యో హ వై ప్రాణో రయి రేవ చంద్రమా రయిర్వా ఏత
త్సర్వం యన్మూర్తం చాఽమూర్తంచ, తస్మా న్మూర్తి రేవ రయిః 5

సూర్యుఁడే ప్రాణము. చంద్రుఁడే యన్నము. స్థూల సూక్ష్మ రూపమైన మూర్తామూర్తము లన్నియు అన్నమే. అమూర్తమైన ప్రాణములచేఁ దినఁబడుటవలన మూర్తి గలదే యన్న మగు నని తెలియవలెను.

అథాఽఽదిత్య ఉదయన్ యత్ప్రాచీం దిశం ప్రవిశతి తేన
ప్రాచ్యాన్ ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే। య ద్దక్షిణాం యత్ప్రతీచీం
య దధో యదూర్ధ్వం యదంతరా దిశో యత్సర్వం ప్రకాశయతి
తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే॥ 6

మఱి సూర్యుం డెప్పుడు తూర్పుదిక్కును బ్రవేశించునో యపుడు తన దీప్తిచే, తూర్పున నున్న ప్రాణములను తన కిరణములందుఁ జేర్చును. ఎప్పుడు దక్షిణముగాను పడమరగను క్రిందుగను పైని మధ్యను మూలలను అంతట ప్రకాశించునో యపుడు సర్వ ప్రాణములను తన కిరణములందుఁ జేర్చును.

స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని
రుదయతే, తదేత దృచా అభ్యుక్తం॥ 7

ఆ యీ ప్రాణమె సర్వప్రాణి స్వరూపుఁడైన సర్వ రూపములు గల యగ్ని, అదె అన్నభక్షకుఁడై యుదయించును. ఈ సంగతి వేద మంత్రముచేతను జెప్పఁబడెను.

తే. గీ. అంతటఁ గబంధితోఁ బిప్పలాదుఁ డనియె
"ప్రజాపతి ప్రజఁ గోరి ధ్యానముండె
ఇటుల నుండి నానాప్రజ నివి సృజించు
ననుచుఁ బ్రాణ మన్న మను జంటను సృజించె. 4

అన్ని ప్రాణులకు ముఖ్యముగ నున్నవి ప్రాణము అన్నమె గనుక ఆ రెండింటిని మొదటఁ బరమేశ్వరుఁడు సృజించె నని భావము.

తే. గీ అక్కడ దా ప్రాణ మగుఁ; జంద్రుఁ డన్న మగును
సకలమగు నమూర్తము మూర్త మన్న మగును
అయినను నమూర్త మగు ప్రాణ మన్ని తినెడి
దగుట మూర్తి గలదె యన్న మనఁగ బడును. 5

తేజస్సు ద్వార సకలపోషకుఁ డగుటచే సూర్యుడు ప్రాణ మనఁ బడెను. అదే సర్వభక్షకుఁడైన యగ్నియును, సూర్యుని ద్వారా తేజస్సును బొంది యోషధీపతి యైన చంద్రుఁ డన్న మనఁబడెను.

తే. గీ. సూర్యుఁ డుదయించి మఱి తూర్పు చొచ్చి యచటి
ప్రాణములు కిరణములందుఁ బఱపు; మఱియు
నలుదిశలఁ గ్రిందఁ బయి మధ్య వెలుఁగఁ జేసి
యచటి ప్రాణముల్ కిరణంబులందుఁ గూర్చు. 6

ప్రాణము సూర్యుఁడుగఁ జెప్పఁబడెను గాన ప్రాణము సర్వాత్మక మైనట్లు, సూర్యుండును సర్వాత్మకుఁడై యుండెనని తెలుపుట కిందు సూర్యుఁడు సర్వదిక్కులందున్నవానిగఁ జెప్పి యక్కడి ప్రాణములను సూర్యుఁడు తన కిరణములందుఁ జేర్చుకొనెనని చెప్పఁబడెను.

కం. అఖిలాత్మకంబు తానయి
యఖిలాకారములఁ దనరు నాయీప్రాణం
బఖిలదిశ నగ్నియై స
మ్ముఖ మగు; నిది ఋక్కుచేతఁ బ్రోక్తం బయ్యెన్. 7

విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతి
రేకం తపంతం సహస్రరశ్మిః శతధా
వర్తమానః ప్రాణః ప్రజానా ముదయ త్యేష సూర్యః 8

అన్ని రూపములు గలిగి, జ్ఞానము కలదై, అన్నిటి కాధారమై వెలిగెడి యొక జ్యోతిని బ్రహ్మవేత్తలు చూచిరి. ఆజ్యోతి వేయి కిరణములు కలదై అనేక ప్రాణులుగ నుండి ప్రజలకు ప్రాణమై వెలుగుచున్నది. ఇదే సూర్యుడు.

సంవత్సరో వై ప్రజాపతి స్తస్యాఽయనే దక్షిణం
చోత్తరం చ, తద్యే హ వై తదిష్టా పూర్తే కృత
మిత్యుపాసతే తే చాంద్రమస మేవ లోక మభిజయంతే॥ 9

సంవత్సరము గూడ ప్రజాపతియే. ఆ ప్రజాపతికి దక్షిణము ఉత్తరము అనునవి రెండును మార్గములు ఎవరు అనిత్యమైన ఇష్టమును (= యాగాదికము) పూర్తమును (నూయి మొదలగు వానిని) ఉపాసింతురో వారు చంద్రలోకమును బొందుదురు.

త ఏవ పునరావర్తంతే తస్మా దేత ఋషయః ప్రజాకామా
దక్షిణం ప్రతిపద్యంతే. ఏష హ వై రయి ర్యః పితృయాణః 10

వారె తిరిగి భూమికి దిగి వచ్చెదరు. కనుక సంతానకాములైన యీ ఋషులు గృహస్థులై దక్షిణాయన రూపమైన చంద్రునినె పొందుదురు. ఈయన్నమైన చంద్రుడే పితృయాణమార్గము.

అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా
విద్యయాఽఽత్మాన మన్విష్యాఽఽదిత్య మభిజయంతే. 11

మఱికొందఱు తపస్సుచేత బ్రహ్మచర్యముచేతను శ్రద్ధచేతను విద్యచేతను ఆత్మను గనుగొని యుత్తరాయణ మార్గముద్వారా సూర్యలోకమును బొందుదురు.

మధు. విశ్వరూపమై దీప్తమై విజ్ఞానవంత మగుచు
విశ్వమూలమై వెలిఁగెడి వెలుఁగొండె బుధులు గనిరి
అదియె వేలరశ్ములు గల్గి ప్రాణిభేదమునఁ బ్రజలఁ
గలుగు ప్రాణ, మీ సూర్యుఁడుగా నుదయించుచుండె. 8

తే. గీ. వత్సరమె ప్రజాపతి, రెండె వానిగతులు
అవ్వి దక్షిణాయన ముత్తరాయణములు
చలము లైన యిష్టాపూర్తముల భజింపఁ
గల రెవరు, వారె చంద్రలోకంబు గాంత్రు॥ 9

అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదపాఠము, అతిథిపూజ, వైశ్వదేవము ఇవి యిష్టము లనఁబడును. నూయి, చెఱువు, గుడి, అన్నదానము తోఁట ఇవి పూర్తము లనఁబడును.

తే. గీ. పుణ్యము నశింప మఱి వారె పుడమి జన్మ
మృత్యువులఁ బొందెద రిఁక నీ ఋషులు పుత్ర
కాములై దక్షిణాయనగతినె గాంత్రు
అట్టి చంద్రాన్నమే పితృయాణ మగును. 10

తే. గీ. శ్రద్ధచేఁ దపస్సున బ్రహ్మచర్యమునను
విద్యచేఁ గొంద ఱాత్మను వెదకి యింక
నుత్తరాయణ మార్గము నొగి గ్రహించి
దరియుదురు సూర్యలోకంబు దానిద్వార. 11

ఏత ద్వై ప్రాణానా మాయతన మేత దమృత మభయ
మేత త్పరాయణ మేతస్మా న్న పునరావ ర్తంత
ఇత్యేష నిరోధ స్తదేష శ్లోకః 12

ఈ సూర్యలోకంబు ప్రాణముల కాధారము. ఇది యమృతము. ఇది భయములేంది. ఇది ముఖ్యమార్గము. దీని నుండి తిరిగిరారు గాన ఇది అజ్ఞానుల కందనిది. ఇది ఈ యర్థమును జెప్పు శ్లోకము.

పంచపాదం పితరం ద్వాదశాకృతిం, దివ ఆహుః పరే అర్ధే పురీషిణం
అథేమే అన్య ఉ పరేంచక్షణం సప్త చక్రే షడర ఆహు రర్పితమితి.

కాలవేత్తలు సంవత్సరరూపమైన సూర్యుని ఋతువు లనెడి యయిదు పాదములు గలవానిగను (హేమంతశిశిర ఋతువులను ఒకటిగా గ్రహించి యయిదు అనంబడెను) అన్నిటిం గలిగించు తండ్రిగను నెలలు అనెడి పండ్రెండు ఆకారములు గలవానిగను ద్యులోకముయొక్క పైభాగము నుండి వర్షించు వానినిగను అందురు. మఱి కొందఱు సూర్యుని సర్వజ్ఞానిగను ఏడు రంగు లనెడి ఏడు గుఱ్ఱము లను కాలచక్రములు గలిగి అయిదు ఋతువు లను బండియాకులు గల చక్రమందు ఉన్నవానిగను అందురు.

మాసో వై ప్రజాపతి స్తస్య కృష్ణపక్ష ఏవ రయిః శుక్లః ప్రాణ
స్తస్మా దేవ ఋషయః శుక్ల ఇష్టం కుర్వంతీతర ఇతరస్మిన్. 14

నెలకూడం ప్రజాపతియె, దానికిం గృష్ణపక్షము అన్నము, శుక్లపక్షము ప్రాణము. కనుక ఈ ఋషులు శుక్లపక్షమందె యజ్ఞమును చేయుదురు. ఇతరులు కృష్ణపక్షమందుం జేయుదురు.

అహో రాత్రో వై ప్రజాపతి స్తస్యాఽహ రేవ ప్రాణో రాత్రి
రేవరయిః ప్రాణం వా ఏతే ప్రస్కందంతి యే దివా రత్యా
సంయుజ్యంతే బ్రహ్మచర్య మేవ తత్ యద్రాత్రౌ రత్యా
సంయుజ్యంతే 15

రేయింబవళ్ళు గూడం బ్రజాపతియె. ఆ ప్రజాపతికిం బవలె ప్రాణము, రాత్రియె యన్నము. ఎవరు పగలు స్త్రీ సంగమము చేయుదురో వారు ప్రాణము నశింపంజేసికొందురు. ఎవరు రాత్రియందు స్త్రీ సంగమము చేయుదురో వారిది బ్రహ్మచర్యమె.

తే. గీ. ప్రాణముల కాశ్రయం బిది యమృత మిద్ది
యభయ మిది పరాయణ మిది యందువలన
జనన మరణంబు లొందఁ; రజ్ఞానుల కిది
యందనిది పద్య మిది యేత దగ్ధకంబు. 12

మత్త. ఋతు లయిదు కాళ్ళు, నెలలు పండ్రెండ్రు రూపముగ జనకుఁ
డగుచు దివి నీరిడుచు సూర్యుఁ డను వత్సరేశుఁ డెసఁగు
నందు; రావత్సరబ్రహ్మ యూటాకు ఋతుల నలరి
సప్తకాల చక్రము లొప్పు జ్ఞానిగా నందు రొకరు. 13

హేమంతశిశిరము లొకటిగా గ్రహించి ఋతువు లయిదు అనఁబడెను. సప్త కాలచక్రములు = సూర్యరథమున కేడుగుఱ్ఱముల కాల చక్రములు. సూర్య కిరణములందలి సప్తవర్ణములు గుఱ్ఱములుగాఁ బూర్వులు కల్పించి యుండవచ్చును. కాలచక్రము వేగముగఁ బరుగెత్తునపుడు ఆ యేడు రంగులొక తెల్పురంగుగా గనిపించును. కాలము అన్నిటికి కారణము గాన బ్రహ్మత్వ కల్పనము.

తే. గీ. ఇఁక నెలయె ప్రజాపతి యగుఁ గృష్ణపక్ష
మన్న మగు; శుక్లపక్షంబు ప్రాణమగును
కావున యజింత్రు శుక్లపక్షమున ఋషులు;
పరులు యజియింత్రు మఱి కృష్ణపక్షమందు. 14

నెలయుఁ గాలరూపమైనదె గానఁ బ్రజాపతిగాఁ జెప్పఁబడినది.

తే. గీ. పవలు రేయుఁ బ్రజాపతి; పవలె ప్రాణ;
మన్న మగును రాత్రి; పగటియందు రతిని
నెసఁగువారు ప్రాణంబు క్షీణింపఁజేతు;
రగును బ్రహ్మచర్యమె రేల రతిని జెంద. 15

రేయింబగళ్ళును గాలములోనివే గానఁ బ్రజాపతి యని చెప్పఁబడెను.

అన్నం వై ప్రజాపతి స్తతో హ వై తద్రేత
స్తస్మా దిమాః ప్రజాః ప్రజాయంత ఇతి॥ 16

అన్నము కూడఁ బ్రజాపతియె అన్నమువల్లనే యా రేతస్సు గలుగుచున్నది. దానివలననె ఈ ప్రజలు పుట్టుచున్నారు.

తద్యే హ వై తత్ప్రజాపతివ్రతం చరంతి తే మిథున
ముత్పాదయంతే తేషా మేవైష బ్రహ్మలోకో యేషాం తపో
బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితం॥ 17

కాన ఎవరు "స్త్రీ ఋతిమతియైనప్పుడు గలియుట" యను ప్రజాపతివ్రతమును చేయుదురో వారె కొడుకులను కుమార్తెలను గనుదురు. ఎవరికి తపస్సు బ్రహ్మచర్యము గలదో ఎవరియందు సత్యమున్నదో వారికే పితృలోక రూపమైన బ్రహ్మలోకము గలుగును.

తేషా మసౌ విరజో బ్రహ్మలోకో
న యేషు జిహ్మ మనృతం న మాయా చేతి. 18

ఎవరియందుఁ గపటము, అసత్యము, మాయయు లేవో వారికిఁ బరిశుద్ధమైన దేవయానరూపమైన సూర్యలోకము గలుగును.

ఇది ప్రథమః ప్రశ్నః

---

అథ ద్వితీయః ప్రశ్నః

అథహైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ. భగవన్ కత్యేవ దేవాః ప్రజాం విధారయంతే, కతర ఏత త్ప్రకాశయంతే కఃపున రేషాం వరిష్ఠ ఇతి.

పిదప భృగువంశస్థుఁడగు వైదర్భి యా పిప్పలాదుని నడిగెను. "ఓ భగవానుఁడా! ఎంత మంది దేవత (ఇంద్రియ శక్తులు) లీశరీరమును దాల్తురు. ఎంతమంది దీనిని వెలిగింతురు. వీరిలో ఎవరు శ్రేష్ఠులు" అని.

కం॥ అన్నమును బ్రజాపతియే
యన్నంబువలవనె గాదె యావీర్యం బు
త్పన్న మగు; దానిచే ను
త్పన్నము లయిరి యీసమస్త ప్రజలు ధరిత్రిన్. 16

తే. గీ. ఋతుగమన మన్ ప్రజాపతి వ్రతము పూను
నరులె పుత్రికా పుత్రులన్ గనుచు నుంద్రు
తపము బ్రహ్మచర్యంబు సత్యంబు నెవరి
కడ నిలుచు వారె బ్రహ్మలోకంబు గాంత్రు. 17

స్త్రీలు ఋతుమతులై నపిదపఁ బదునాఱుదినములె ఋతుకాలము. ఆ కాలమునఁ గలిసిరనె సంతానము గలుగును. ఆ ఋతుగమనమె ప్రజాతంతువిచ్ఛేదము కాకుండఁ జేయునది గాన అది ప్రజాపతి వ్రత మనఁబడెను. ఇటు బ్రహ్మలోక మనఁగా పితృలోకము.

కం॥ అనృతము, కపటముఁ మాయయు
మనుజులలో నెవనియందు మసలవొ యతఁడే
యఃయంబు నిర్మలం బయి
పొనరెడు నీ బ్రహ్మలోకమున వర్ధిల్లున్. 18

ఇది మొదటి ప్రశ్నము

---

ఇంక రెండవ ప్రశ్నము.

తే. గీ. పిదప భృగుజుండు వైదర్భి పిప్పలాదు
దెసకుఁ జని యడిగె "మహాత్మ! దేవు లెంద
ఱీతనువుఁ దాల్తు; రెవరు భాసింపఁజేతు
రెవరు వీరిలో శ్రేష్ఠులై యెసంగుచుంద్రు"॥ 1

మొదటి ప్రశ్నలో ప్రాణము భక్షకుఁడని ప్రజాపతియని చెప్పఁబడెను. ఇందు ఆ భక్షకత్వాదులు ఈ శరీరమందు నిర్ధారణ చేయఁబడు చున్నవి.

తస్మై స హోవాచాఽఽకాశో హ వా ఏష దేవో వాయురగ్ని
రాపః పృథివీ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రంచ తే ప్రకా
శ్యాభివదంతి వయమేతద్బాణ మవష్టభ్య విధారయామః". 2

అతనికిఁ బిప్పలాదుఁ డిట్లనెను. "ఆకాశము, గాలి, అగ్ని, నీరు, నేల, వాక్కు, మనస్సు, కన్ను, చెవి యను దేవులు తమ శక్తిఁ జూపి యెవరికివారు "మేమే యీ శరీరమును దాల్చుచుంటిమి" అనిరి.

తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ, మా మోహ మాపద్య థాఽహ
మే వైత త్పంచథాఽఽత్మానం ప్రవిభ జ్యైత ద్బాణ
మవష్టభ్య విధారయా మీతి తేఽశ్రద్ధధానా బభూవుః. 3

అపుడు వానితో శ్రేష్ఠమైన ప్రాణ మిట్లనెను. "మీరు మోహము పొందకుఁడు. నేనె నన్ను ఐదువిధములుగ విభజించుకొని యీ శరీరమును పట్టుకొని దాల్చుచున్నాను" అని. అవి యీ మాటలను లెక్కపెట్ట వయ్యెను.

సోఽభిమానా దూర్ధ్వ ముత్క్రమత ఇవ తస్మి న్నుత్క్రామ
త్యథేతరే సర్వ ఏవోత్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠమానే
సర్వ ఏవ ప్రాతిష్ఠంతే, తద్యథా మక్షికా మధుకరరాజాన
ముత్క్రామంతం సర్వా ఏవో త్క్రామంతే తస్మింశ్చ ప్రతిష్ఠ
మానే సర్వా ఏవ ప్రాతిష్ఠంత ఏవం వాఙ్మన శ్చక్షుః
శ్రోత్రంచ తే ప్రీతాః ప్రాణం స్తున్వంతి॥ 4

ఆ ప్రాణ మభిమానముచేఁ బైకి లేచిపోవుచున్నదానివలెఁ గాఁగా అది లేచుచుండ నన్నియు లేవఁదొడఁగినవి. అది నిలవఁగా అన్నియు నిలవఁదొడఁగినవి. తేనెటీఁగలు తమరాణి లేచిపోఁగా లేచిపోవుచు నిలవఁగా నిలుచుచు ఉన్నట్లు వాక్కు మనస్సు కన్ను చెవి యుండెను. పిదప అవి సంతోషముతో ప్రాణమును ఇట్లు పొగడెను.

ఏషోఽగ్ని స్తప త్యేష సూర్య ఏష పర్జన్యో మఘవా నేష
వాయు రేష పృథివీ రయి ర్దేవః సదస చ్చామృతం చ యత్. 5

తే. గీ. అనఁగఁ బిప్పలాదుఁడు చెప్పె "నాకసంబు
వాయు, వగ్ని, నీరును, నేల వాక్కు మనను
కనులు చెవులను దేవుల్ స్వకాంతి చూపి
యెవరికిని వారె నిల్పితి మియ్య"దనిరి. 2

ద్యోతన స్వభావము గలవి గాన దేవులు అని వ్యుత్పత్తిని బట్టి దేవులనఁగా నింద్రియములు. ఆ యా ఇంద్రియాధిదేవత లనియుఁ జెప్పనగును.

తే. గీ. వాటితో నిట్లు శ్రేష్ఠమా ప్రాణమనియె
భ్రాంతి వీడుఁడు నను నేనె పంచగతుల
నమరి యీమేను నిల్పుదు నని వచింపఁ
బిదప నా మాట లవి లక్ష్య పెట్టవయ్యె. 3

ప్రాణము ఒకటియె కన్నులు చెవులు ముక్కులు నాలుక చర్మము అను నింద్రియములకు శక్తి నిచ్చి యాయా పనులను జేయించుచున్న దని భావము.

మధు. ప్రాణ మభిమానపడి పైకి నరిగి నట్లేగ నవియు
నెల్లఁ బైకేగు, నదె నిల్చునెడ నిల్చుఁ దేనెటీఁగ
లెట్లు తమ రాణి యెగురంగ నెగురు నిల్వ నిలుచు నటు
వాక్కు మనను కన్నులు చెవుల్ వఱలి ప్రాణమును బొగడె. 4

అన్ని యింద్రియముల శక్తి ప్రాణశక్తివలననె గలిగినది గాన ఆ ప్రాణము లేచిపోవుటకుఁ బ్రయత్నింపగా వాక్కు పలుకలేనిదై, మనస్సు సంకల్పింపలేనిదై కన్ను చూడలేనిదై చెవి వినలేనిదై యీ మనన్నిటికిఁ బ్రాణమె శక్తి ఆ ప్రాణమును బట్టి కలిగినదని తలఁచి తా మన్నిటికిఁ బ్రాణమె ఆధారమని గుర్తించి తనకు మూలాధారమైన ప్రాణమును వాగాదులు పొగడఁదొడఁగెనని భావము.

గీ. "అగ్నియై మండు నిది, సూర్యుఁడయి వెలుఁగు
మబ్బయి కురియు, నింద్రుఁడై మనుచు; గాలి

ఈ ప్రాణ మగ్నియై మండును. సూర్యుఁడై వెలుఁగును. మేఘమై కురియును. ఇంద్రుఁడై పాలించును. వాయువై వీచును. భూమియై నిలుపును. ఇతఁడు దేవుఁడైన చంద్రుఁడు సత్తు అసత్తు అమృతమును ఈ ప్రాణమే.

అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితం
ఋచో యజూంషి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మచ. 6

బండినాభియందు ఆకులవలె ప్రాణమందు ఋక్కులు యజుస్సులు సామములు యజ్ఞము క్షత్రధర్మము బ్రహ్మధర్మము అన్నియు నిలిచి యున్నవి.

ప్రజాపతి శ్చరసి గర్భే త్వమేవ జాయసే, తుభ్యం ప్రాణ
ప్రజా స్త్విమా బలిం హరంతి యః ప్రాణైః ప్రతితిష్ఠసి॥ 7

ఓ ప్రాణమా, నీవే ప్రజలకుఁ బ్రభువై తల్లిదండ్రుల గర్భమందుఁ జరించుచున్నావు. నీవే సంతానమవై పుట్టుచున్నావు. కన్ను మొదలగు వానిద్వారా ఈ ప్రజలు రూపము మొదలగు పూజాద్రవ్యముల నిచ్చుచున్నారు. నీవు శరీరమున కన్ను మొదలగువానిచే నిలిచి యున్నావు.

దేవానా మసి వహ్నితమః పితౄణాం ప్రథమా స్వధా
ఋషీణాం చరితం సత్య మథర్వాంగిరసా మసి॥ 8

నీవు దేవతలకు హవిస్సును దీసికొనిపోవువారిలో శ్రేష్ఠుఁడవు. పితరుల కిచ్చెడు మొదటి స్వధ (అన్నము) నీవే. అథర్వుఁడు అంగిరసుఁడు మొదలగు ఋషుల యొక్కయు లేక అంగములు గల శరీరమునకు సారమైన ప్రాణము కన్ను మొదలగు నింద్రియముల యొక్కయు సత్య చరిత్రము నీవే యయి యున్నావు.

ఇంద్ర స్త్వం ప్రాణ తేజసా రుద్రోఽపి పరిరక్షితా
త్వ మంతరిక్షే చరసి సూర్య స్త్వం జ్యోతిషాం పతిః 9

ఓ ప్రాణమా! నీవే యింద్రుఁడవు (= పరమేశ్వరుఁడవు). తేజస్సుచే రుద్రుఁడవు పాలకుఁడవు. నీవు సూర్యుఁడవై యాకాశమునఁ జరింతువు. నీవు నక్షత్రాది జ్యోతిస్సులకు ప్రభుడవు.

యయి నిలుపు; భూమివై తాల్చు, నమృతకుం
డయి మొదమిడు, మూర్త మమూర్త యమృతి మిడిమె. ౫

తే. గీ. బండినాభి నాకులు నిల్చుపగిది ఋక్కు-
లాయజస్సులు సామముల్ యాగములును
క్షత్రధర్మము బ్రహ్మవిజ్ఞాన మనెడు
నివ్వియెల్లఁ బ్రాణము నాశ్రయించి యుండు. ౬

కం. ప్రజకుఁ బతివై చరించెద
వు జనని జనకులకు గర్భమున బీజమవౌ
చు జనింతువు, ప్రాణమ! యీ
ప్రజ బలి నీకిడు; నిలుతువు ప్రాణావళితో. ౭

కం. దేవులకు హవి సిడు ననలుఁ
డీవె పితరులకుఁ దొలిస్వధయిడు పతివీవే
నీవె ఋషుల సత్యచరిత,
మీవె యథర్వాంగిరసుల ఋత మాగతియున్. ౮

ఋషగతౌ=నడకయందు అను ధాతువును బట్టి [illegible] మునులును చక్షురాదులైన యింద్రియములును 'ప్రా[illegible]' అను శ్రుతిని బట్టి అథర్వుఁ డనఁగాఁ బ్రాణమును, అంగి[illegible] రమునకు రసములు సారములైన యింద్రియములు [illegible]షుల యొక్క యింద్రియముల యొక్క సత్యచరిత్ర ప్రాణ మని భావము.

కం. నీ వింద్రుఁడవు ప్రాణమ!
నీవే రుద్రుఁడవు శక్తి; నీవే పతివిన్
నీవె దివిఁ దిరుగు సూర్యుఁడ
వీవే జ్యోతులకు నెల్ల నీశానుడవున్. ౯

యదా త్వ మభివర్షస్యథేమాః ప్రాణ తే ప్రజాః
ఆనందరూపా స్తిష్ఠంతి కామా యాన్నం భవిష్య తీతి. 10

నీవు మేఘుఁడవై వాన కురిసినపుడు ఈ ప్రజలు బ్రతుకు చున్నారు. అపుడు వారు ఆనందరూపులై యుందురు. వారి కోరికను బట్టి యన్నము గలుగుచున్నది.

వ్రాత్య స్త్వం ప్రాణైకఋషి రత్తా విశ్వస్య సత్పతిః
వయ మాద్యస్య ధాతారః పితా త్వం మాతరిశ్వనః 11

ఓ ప్రాణమ! సంస్కారము లేకయె శుద్ధుఁడవై యున్నావు. ఏక ఋషి యని పేరుగల యగ్నివి, హవిర్భక్షకుఁడవు. సర్వమునకుఁ బతివి. మేము నీకు హవిస్సు నిచ్చెదము. వాయువా, నీవు మాకుఁ దండ్రివి.

యా తే తనూ ర్వాచి ప్రతిష్ఠితా యా శ్రోత్రే యాచ చక్షుషి
యా చ మనసి సంతతా శివాం తాం కురు మోత్క్రమీః 12

ఏ శరీరము నీది వాక్కునందు నిలిచియుండెనో ఏది చెవియందు ఏది కంటియందు ఏది మనస్సునందు వ్యాపించి యున్నదో యా శరీరము శుభమైన దానిఁగఁ జేయుము. విడిచిపెట్టి పోవకు.

ప్రాణ స్యేదం వశే సర్వం త్రిదివే యత్ప్రతిష్ఠితం
మాతేవ పుత్రాన్ రక్షస్వ శ్రీశ్చ ప్రజ్ఞాం చ విధేహి న ఇతి. 12

ఇది యంతయుఁ బ్రాణము యొక్క వశమం దున్నది. దివమం దున్న దంతయును బ్రాణవశమందె యున్నది. పుత్రులను దల్లివలె మమ్ము నీవు రక్షింపుము. లక్ష్మిని ప్రజ్ఞను మా కిమ్ము.

ఇది ద్వితీయః ప్రశ్నః

---

కం. జలదుఁడవై యెన్నఁడు జల
ములఁ గురియుదువో యపుడు జనములకున్ బ్రతుకౌ
ఇల జనులు చిదానందమ
యు లయ్యెదరు, వారి యిచ్ఛ కోగి నన్న మగున్. 10

కం. ఏవి నిన్ను సంస్కరింపఁగ
ల, వేకఋషి వఖిలలోకరక్షకుఁడవు భో
క్తవు, ప్రాణమ! మాకును దం
డ్రివి గద యర్పింతు మివిగొ నీకు హవిస్సుల్. 11

కం. ఏది వాక్కున నిలచెనో యె
య్యది చెవులఁ గనుల మనసున వ్యాపించెనో య
య్యది నీతనువున నిట శుభ
ప్రదముగ నొనరింపు మింక వదలక దీనిన్. 12

కం. ఇందును నెందును ద్రిదివము
నం దఖిలము ప్రాణము వశమందె తనర్చున్
నందనులఁ దల్లివలెఁ బ్రో
వం దగుదువు; మాకు శ్రీలు ప్రజ్ఞయు నిడుమీ. 13

ఇది

రెండవ ప్రశ్నము.

## అథ
## తృతీయః ప్రశ్నః

అథ హైనం కౌసల్య శ్చాశ్వలాయనః పప్రచ్ఛ; భగవన్ కుత
ఏషప్రాణో జాయతే, కథ మాయా త్యస్మిన్ శరీర. ఆత్మానం వా
ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే కేనో త్క్రమతే కథం బాహ్య
మభిధత్తే కథ మధ్యాత్మ మితి. 1

పిదప అశ్వాల వంశస్థుఁడైన కౌసల్యుఁడు వచ్చి పిప్పలాదుని నడిగెను. “(1) భగవానుఁడా! దేనినుండి యీ ప్రాణము పుట్టుచున్నది. (2) పుట్టి యే విధముగా ఈ శరీరమునందుఁ బ్రవేశించుచున్నది. (3) ఈ ప్రాణము తన్ను వేఱు వేఱుగా విభజించుకొని యెట్లు నిలిచియున్నది. (4) ఏ వ్యాపారముచే ఈ శరీరము నుండి వెడలి పోవుచున్నది. (5) ఎట్లు పై నున్న భూతములను (6) లోని యాత్మను ధరించుచున్నది” అని.

తస్మై స హోవా చాఽతి ప్రశ్నాన్ పృచ్ఛసి
బ్రహ్మిష్ఠోఽసీతి, తస్మా త్తేఽహం బ్రవీమి. 2

అపుడు కౌసల్యునికిఁ బిప్పలాదుఁడనియె. “నీవు విషమప్రశ్నలడుగుచున్నావు. నీవు మిక్కిలిగ బ్రహ్మమును దెలిసినవాఁడ వని నీకు నేను జెప్పుచున్నాను.”

ఆత్మన ఏష ప్రాణో జాయతే, యథైషా పురుషే ఛాయైతస్మిన్,
ఏత దాతతం మనః కృతే నాఽఽయా త్యస్మిన్ శరీరే. 3

(1) పరమాత్మ నుండి యీ ప్రాణము పుట్టుచున్నది. ఎట్లు లోకమందు కర చరణాదులు గల పురుషుని నుండి నీడ బయలుదేఱుచున్నదో యట్లే యీ పరమాత్మ నుండి ప్రాణము వ్యాపించినది. (2) ఇది మనస్సంకల్పముచే శరీరములోనికి వచ్చుచున్నది.

ఇంక

## మూఁడవ ప్రశ్నము.

అథ అశ్వలాయనుండు కౌసల్యుఁ డిఁక వచ్చి యతనిక ని "మ
హాత్మ! యెందు ప్రాణము పుట్టు, నది యెట్లు మేను సొచ్చు
అది విడి విడియై యెటులుండు, నది యెట్లు మేను విడుచు
ఎట్టు బహిశ్శరీరము దాల్చు, నెటుల నధ్యాత్మ మౌను. 1

వైదర్భికిఁ బిప్పలాదుఁడు ప్రాణశక్తిని గూర్చి చెప్పెను. ఇఁక కౌసల్యుఁడు వచ్చి వైదర్భి తెలిసికొన్న ప్రాణమును గూర్చి విశదముగా అది యెక్కడ నుండి పుట్టుచున్నది మొదలగు ప్రశ్నలడుగుచున్నాఁడు. ఇందు ప్రాణోపాసన చెప్పఁబడుచున్నది. వీనికి ప్రశ్నములో సమాధానములు చెప్పఁబడుచున్నవి

కం. అని యడుగఁ బిప్పలాదుం
డను "నీవడుగునవి విషమ మగు ప్రశ్నంబుల్
అనయ మధిక బ్రహ్మవిదుఁడ
వని నేనిదె చెప్పుచుంటి నయ్యవి నీకున్. 2

కం. పరమాత్మ నుండి ప్రాణము
వఱలును; మఱి పురుషునందుఁ బ్రతిబింబ మటుల్
పరమాత్మను బ్రాణము వి
స్తరిలి తనువుఁ జొచ్చుఁ జిత్త సంకల్పముచే. 3

యథా సమ్రాడేవాధికృతాన్ వినియుంక్తే, ఏతాన్ గ్రామా
నేతాన్ గ్రామా నధితిష్ఠ స్వేత్యేవ మేవైష ప్రాణ ఇతరాన్
ప్రాణాన్ పృథక్ పృథ గేవ సంనిధత్తే. 4

(4) ఈ గ్రామములందు నీవుండుము అని చక్రవర్తి ఉద్యోగస్థుల కాజ్ఞ యిచ్చినట్లు ఈ ప్రాణము కన్న మొదలైన ఇతర ప్రాణములను వాని చోట్లల వేఱు వేఱుగా నియోగించును.

పాయూపస్థేఽపానం, చక్షుః శ్రోత్రే ముఖ నాసికాభ్యాం ప్రాణః
స్వయం ప్రాతిష్ఠతే, మధ్యే తు సమానః ఏష హ్యేతత్ హుత
మన్నం సమం నయతి తస్మా దేతాః సప్తార్చిషో భవంతి. 5

మలమూత్ర ద్వారములందు అపానమై, కన్ను చెవి నోరు ముక్కుల దగ్గర స్వయముగఁ దానే ప్రాణమై యుండును. మధ్యమగు నాభి ప్రదేశమున నున్నది సమాన మను పేరుతో నుండును. ఇది శరీరమున హోమము చేయఁబడిన అన్నమును సమానముగ నడపును. అందువల్ల మధ్య నున్న జఠరాగ్నినుండి చెవులు ౨ కన్నులు ౨ ముక్కులు ౨ ముఖము లను ఏడు జ్వాలలు గలుగు చున్నవి.

హృది హ్యేష ఆత్మా, అత్రైత దేకశతం నాడీనాం; తాసాం
శతం శత మేకైకస్యాం, ద్వాసప్తతి ర్ద్వాసప్తతిః ప్రతిశాఖా నాడీ
సహస్రాణి భవంత్యాసు వ్యాన శ్చరతి. 6

హృదయమందు యీ యాత్మ యున్నది. ఈ హృదయమందు నూటయొక నాడు లున్నవి. వాటిలో ఒక్కొక్క నాడియందు నూఱు నూఱేసి చిన్న నాడు లున్నవి. ప్రతి నాడియందు డెబ్బది రెండువేల చిన్న నాడు లున్నవి. వీనియందు వ్యాన వాయువు సంచరించును.

కం. ఈయూళ్ళు నీవు చూడుమి
యూయూళ్ళను నీవు చూడు మని భూపతి యా
యూయుద్యోగి నడపు న
ట్లే యది నేత్రాది ప్రాణబృందము నడుపున్. 4

ఇది మూఁడవ ప్రశ్నకు సమాధానము.

మధు. మలము మూత్రంబు ద్రోయుచోటుల నపాన మన నొప్పి
కన్ను చెవి ముక్కు మోములకడఁ దానె ప్రాణముండు
మధ్యనొ సమాన, మిది హుత మన్నంబు సమత నడపు
అందుఁ జెవి ముక్కు కను మోము లనెడి సప్తార్చు లమరు. 5

ప్రాణవాయు వొకటి స్థానభేదమును బట్టి అపానాది నామభేదములను బొందును. శరీర మధ్య నున్న సమాన వాయువె యాహారమును సరిగా నడుపును. అక్కడి జఠరాగ్ని నుండి చెవులు ౨ ముక్కులు ౨ కన్నులు ౨ ముఖము ౧ అను దీప్తులు వెలుగుచున్నవి. జఠరాగ్నివలనఁ బక్వమైన యన్న రసబలముచే వినుట మొదలగు క్రియలు జరుగుచున్నవి గాన చెవులు మొదలగునవి జ్వాలలుగా ఆరోపింపఁ బడెను.

మధు. హృదయగుహ నుండు జీవాత్మ యిది, యందె నూట యొకటి
నాడు లుండు; నొక్కొక్క నాడి నమరు నూటేసి, మరియు
నాడినాడి డెబ్బది రెండువేల నాడులు చెలంగు
వీని యన్నిటి యందును వ్యాన మన్ గాలి తిరుగు. 6

మొత్తము శరీరమునఁ జిన్నవి పెద్దవి కలిపిన డెబ్బది రెండు కోట్ల డెబ్బది రెండు లక్షల పదివేల రెండు వందల యొకటి నాడు లున్నవని భావము. వ్యాపించుటచే వ్యానమని పేరు గలిగెను.

అథైక యోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి
పాపేన పాప ముభాభ్యా మేవ మనుష్యలోకం.

(4) మఱి సుషుమ్న యను నాడిచేఁ బైకిఁ బోయి కంఠమందలి యుదానవాయువు కేవల పుణ్యకర్మచేఁ బుణ్యలోక మయిన దేవలోకమును కేవల పాపకర్మలచేఁ బాపలోక మగు తిర్యగ్యోన్యాదులను సమప్రధానమైన పాప పుణ్యకర్మలచే మనుష్య లోకమును జీవులను బొందించును.

ఆదిత్యో హ వై బాహ్యః ప్రాణ, ఉదయత్యేష హ్యేనం చాక్షుషం ప్రాణ మనుగృహ్ణానః, పృథివ్యాం యా దేవతా సైషా పురుష స్యాపాన మవష్ట, భ్యాంతరా యదాకాశః స సమానో, వాయు ర్వ్యానః.

(5) సూర్యుఁడె వెలుపలి ప్రాణము. ఇదే కన్నులయం దున్న ప్రాణమును అనుగ్రహించుచు నుదయించుచుండెను. భూమి యందలి దేవత (భూదేవత) పురుషుని యపాన వ్యాపారమును వశపఱచుకొని యనుగ్రహము చూపుచున్నది. భూమ్యాకాశముల మధ్య నున్న యాకాశమునం దున్న వాయువు సమానము ననుగ్రహించుచున్నది. బాహ్యవాయువు వ్యానవాయువు ననుగ్రహించుచున్నది.

తేజో హ వా ఉదాన స్తస్మా దుపశాంత తేజాః
పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః.

బాహ్య తేజస్సే యుదానవాయువు ననుగ్రహించును. జీవనమును నిల్పు కర్మలు ముగియఁగా ఆ వాయువు యొక్క యనుగ్రహము పోఁగా జీవుఁడు శాంతించిన తేజస్సు గలవాఁడై అనఁగాఁ జనిపోయి మనస్సునందు లీనమై పోయిన యింద్రియములతోఁ గూడ మఱి యొక శరీరమును బొందును.

తే. గీ. మఱి సుషుమ్నాఖ్య నాడితో శిరసుపైకిఁ
గని యుదానవాయువు పుణ్యకర్మచేతఁ
బుణ్యలోకమున్ మఱి పాపములను బాప
లోక, ముభయకర్మల మర్త్యలోక మొసఁగు. 7

కంఠమం దున్న వాయువు ఉదాన మనఁబడును. శరీరము నుండి పోవు విధ మిందు చెప్పఁబడినది. ఇది 4వ ప్రశ్నకు సమాధానము.

తే. గీ. అర్కుఁడే బాహ్య మగు ప్రాణ, మతఁడు కనుల
నెసఁగు ప్రాణశక్తి ననుగ్రహించి వెలుఁగు
ప్రజ యపానమున్ భూదేవి పట్టి నిలుపు
పయిని గాలి వ్యాన సమాన వాయువు లూను. 8

ఇదె 5వ ప్రశ్నకు జవాబు. భూదేవి ప్రజల యపాన వాయువును వశముఁజేసి నిలుపుచున్నది. లేనిచో శరీరము బరువుగా నుండుటచేఁ బడిపోయి యుండెడిది. అవకాశమందు ఎగిరిడిదే యని భావము. దీనినే భూమ్యాకర్షణశక్తి యని నవీన విజ్ఞానులు.

తే. గీ. బాహ్య మగు తేజమె యుదానవాయువు న
నుగ్రహించుఁ; దేజోమయుండుగ నరుండు
వెలయుకతన నా తేజు శాంతిలఁగ మదిని
నణఁగు నింద్రియముల నన్యతనువు లొందు. 9

జీవుఁడు చనిపోవు సమయము వచ్చినపుడు వాని దేహమందలి యుదాన వాయువుపైని గల బాహ్యతేజము యొక్క యనుగ్రహము పోవును. అనుగ్రహము పోఁగా ఆ జీవుఁడు చనిపోయి శరీరాంతరముఁ బ్రవేశించు నని భావము. ఇది 6వ ప్రశ్నకు జవాబు.

యచ్చిత్త స్తేనైష ప్రాణ మాయాతి ప్రాణ స్తేజసా యుక్తః
స హాఽఽత్మనా యథా సంకల్పితం లోకం నయతి. 10

మరణకాలమున జీవుఁ డెట్టి మనస్సు గలవాఁడై యుండునో యట్టి మనస్సుతోనే ఇంద్రియ వ్యాపారములు క్షీణింపఁగా ముఖ్య ప్రాణ వ్యాపారమును బొందును. అపు డా ప్రాణము ఉదాన వాయురూపమైన తేజస్సుతోఁ గూడినదై యాత్మతోఁ గూడఁ దాను సంకల్పించుకొన్న లోకమునకు జీవుఁ బొందించును.

య ఏవం విద్వాన్ ప్రాణం వేద, న హాఽస్య ప్రజా
హీయతేఽమృతో భవతి తదేష శ్లోకః 11

ఈ విధముగా ఏవిద్వాంసుఁడు ప్రాణమును గూర్చి తెలిసికొనునో వాని సంతానమునకు హాని గలుగదు. అతఁడు అమృతుఁ డగును. ఇది యీ యర్థమును జెప్పు శ్లోకము.

ఉత్పత్తి, మాయతిం, స్థానం విభుత్వం చైవపంచధా.
అధ్యాత్మం చైవ ప్రాణస్య విజ్ఞాయామృత మశ్నుతే
విజ్ఞాయామృత మశ్నుత ఇతి. 12

ప్రాణము యొక్క పుట్టుకను, రాకను, సాకల్యమును బట్టి శరీరమున ఉండుటను, అయిదు విధములుగా ఉండి చక్రవర్తివలెఁ ప్రభుత్వమును బొందుటను బాహ్యమున సూర్యుఁడుగను లోక చక్షురాదులుగను నుండుటను దెలిసికొని మనుజుఁడు అమృతుఁ డగును, అమృతుఁ డగును.

ఇతి

తృతీయః ప్రశ్నః

తే. గీ. మరణకాలమునం దెట్టి మనసుతోడఁ
ప్రాణి యుండు నామనసుతోఁ ప్రాణ మొందు,
తేజుగల ప్రాణ మాత్మతో దీప్తినొంది
గనును దాను సంకల్పించు కొనిన జన్మ. 10

మరణ సమయమున ఇంద్రియ వ్యాపారము లన్నియు ముఖ్య ప్రాణము నాశ్రయింపఁగా ఆ ప్రాణము తాను సంకల్పించుకొన్న చోటికిఁ బోవునని భావము.

కం. ఏ విద్వాంసుఁడు ప్రాణము
నీవిధముగఁ దెలిసికొనునో యతని కులంబుల్
ఏవిధిని నశింపవు మఱి
యావిద్వాంసుఁ డమృతుఁ డగు నిది పద్య మగున్. 11

ఆ. వె. ఆత్మనుండి ప్రాణ మావిర్భవించుట
మెయిని జొచ్చుట యది యయిదు నగుట
బైని సూర్యుఁ డగుట లో నింద్రియము లౌట
నరసి యమృతుఁ డగును నమృతుఁ డగును. 12

ప్రాణ తత్త్వము నీవిధముగఁ దెలిసినవాఁడు మరణభయము దాటినవాఁ డగును. ప్రాణతత్త్వమును దెలిసినవాఁడు మరణ మనఁగా శరీరాంతర ప్రాప్తియే యని తెలిసినవాఁడు గాన విచారింపఁడని భావము.

ఇది

మూఁడవ ప్రశ్నము.

## అథ చతుర్థః ప్రశ్నః

అథ హైనం సౌర్యాయణీ గార్గ్యః ప్రప్రచ్ఛ "భగవ న్నేతస్మిన్
పురుషే కాని స్వపంతి, కాన్యస్మిన్ జాగ్రతి, కతర ఏష దేవః
స్వప్నాన్ పశ్యతి కస్యైతత్ సుఖం భవతి, కస్మిన్ ను సర్వే
సంప్రతిష్ఠితా భవం" తీతి. 1

పిదప సూర్యవంశస్థుఁడైన గార్గ్యుఁడు పిప్పలాదుని నడిగెను. "భగవాఁనుఁడా! ఈ జీవునియందు ఏవి నిద్రించుచున్నవి? వీనియం దేవి మేల్కొనుచున్నవి? ఏ దేవుఁడు స్వప్నములను జూచును? ఈ యనుభవించెడి సుఖము ఎవనికిఁ గలుగుచున్నది? జాగ్రత్స్వప్న వ్యాపారముల నుండి మరలిన యింద్రియములు ఎందు లీనమగుచున్నవి?" అని

తస్మై స హోవాచ, యథా గార్గ్య మరీచయోఽర్కస్యాఽస్తం
గచ్ఛతః సర్వా ఏతస్మిం స్తేజోమండల ఏకీభవంతి, తాః పునఃపున 2
రుదయతః ప్రచరం త్యేవం హవై తత్సర్వం పరే దేవే మనస్యేకీభవతి.

గార్గ్యునకుఁ బిప్పలాదుఁ డిట్లనెను. "ఓ గార్గ్య! సూర్యుఁడు అస్తమించుచుండఁగా కిరణము లన్నియు ఆ సూర్యుని తేజోమండలమం దెట్లు లీనమగునో ఉదయించుచుండ మరల మరల నెట్లు ఉదయించుచున్నవో యట్లే స్వప్నమందు ఇంద్రియము లన్నియు మిక్కిలి ప్రకాశించు మనస్సునందు లీన మగుచున్నవి. మెల్కువయందు ఆ మనస్సు నుండి తిరుగ బయలుదేఱుచున్నవి.

తేన తర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి
న రసయతే న స్పృశతే నాభివదతే నాఽఽదత్తే నానంద
యతే న విసృజతే నేయాయతే స్వపి తీత్యాచక్షతే. 3

అందుచే నపుడు ఈ జీవరూపుఁడైన పురుషుఁడు వినఁడు చూడఁడు వాసన చూడఁడు రుచిచూడఁడు తాకఁడు పలుకఁడు పుచ్చుకొనఁడు సంతసింపఁడు ఏడువఁడు కదలఁడు అప్పుడు వానిని నిద్రించుచున్నాఁడని యందురు.

ఇంక

## నాల్గవ ప్రశ్నము

మధు॥ అంత సూర్యవంశ్యుఁడు గార్గ్యుఁ డడిగెను బిప్పలాదు,
ఓమహాత్మ! యెయ్యవి నిద్ర నొందు నీపురుషునందు
ఏవి మేల్కొనుఁ, గలల నేదేవుండు చూచు, నెవని
కీసుఖము గల్గు, నెవనిలో నివి యన్ని నిలచియుండు. 1

ఇదివఱకటి ప్రశ్నములలో ఇంద్రియగోచర మయి యుండు అపర బ్రహ్మమగు ప్రాణమును గురించి చెప్పఁబడినది. ఇపు డిందు అతీంద్రియ గోచర మగు పరబ్రహ్మ తత్త్వము గూర్చి చెప్పఁబడుచున్నది.

తే. గీ. అతఁడిటులని గార్గ్యుఁడ; సూర్యుఁ డస్తమింప
రశ్ము లెట్లు తేజోమండలమున నేక
మయి తిరుగ సూర్యుఁ డుదయింప మరల వెడలు
నిట్లె యివి మదిన్ నిద్రలో నేక మగును॥ 2

ఇంద్రియములు మనస్సులో ఏకమగుట యనఁగా ఇంద్రియములు తమ తమ వ్యాపారములు మాని మనస్సున కధీనములయి యుండుటయె. అంతేకాని ఇంద్రియములు తమతమ దర్శనాది స్వభావ కర్మలను విడుట కాదని తెలియునది.

తే. గీ. ఇంద్రియము లెల్ల మనసులో నేకమయిన
నరుఁడు వినఁడు చూడఁడు వాసనగొనఁడు రుచి
గనఁడు, తాకఁడు, పల్కఁడు కొనఁడు సుఖము
గనఁడు, విడఁడు తిర్గఁడు నిద్రగొనె నటంద్రు. 3

ఇంద్రియములు తమతమ వ్యాపారములు మనస్సున కధీనము లగుటచే నరుఁ డేమియుఁ జేయఁడని భావము.

ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి, గార్హపత్యో
హ వా ఏషోఽపానో, వ్యానోఽన్వాహార్య పచనో,
యద్గార్హపత్యా త్ప్రణీయతే, ప్రణయనా దాహవనీయః ప్రాణః 4

చెవులు మొదలైనవి నిద్రింపఁగా ఈ శరీర మను పట్టణమందు ప్రాణాది పంచాగ్నులె మేల్కొని యుండును. ఈ యపానము గార్హపత్యాగ్నివంటిది. వ్యానవాయువు దక్షిణాగ్నివంటిది. గార్హపత్యాగ్ని నుండి గ్రహింపఁబడుట వలనఁ బ్రాణము ఆహవనీయ మనఁబడును.

యదుచ్ఛ్వాసనిఃశ్వాసా వేతా వాహుతీ సమం నయతీతి సమానః
మనో హ వావ యజమాన ఇష్టఫల మే వోదానః
స ఏనం యజమాన మహ రహ ర్బ్రహ్మ గమయతి. 5

ఉచ్ఛ్వాస నిశ్వాసము లనెడి యాహుతులను సమముగా నడుపుటవలన సమాన మనఁబడెను. మనస్సె యజమానుఁడు. యాగఫలమె యుదానవాయువు. ఆ యుదానవాయువె మనస్సనెడి యీ యజమానుని బ్రహ్మ మనెడి స్వర్గమును బ్రతిదినముఁ బొందించును.

అత్రైష దేవం స్వప్నే మహిమాన మనుభవతి
యదృష్టం దృష్ట మనుపశ్యతి, శ్రుతం శ్రుత మేవార్థ మనుశృణోతి
దేశదిగంతరై శ్చ ప్రత్యనుభూతం పునః పునః ప్రత్యనుభవతి. 6

(చెవులు మొదలగునవి తమతమ పనులు మానఁగాఁ బ్రాణాది వాయువులు శరీరమును రక్షించుచుండఁగా) ఈ మధ్యకాలమున ఈ మనో దేవుఁడు స్వప్నమందు అనేకవిషయ వైచిత్రిరూప మగు మహిమను అనుభవించును. ఇదివరకుఁ జూచినదె తిరిగి చూచును. వినిన విషయమునె వినును. దేశాంతరముచేతను ఇతర దిక్కుచేతను అనుభవించినదానినె తిరుగ అనుభవించును.

మధు॥ అప్పుడు ప్రాణాగ్నులె శరీర మను పురిన్ మేలుకొనును.
ఆయపానమె గార్హపత్యాగ్నియగా, వ్యానమింక,
దక్షిణాగ్నియగా; గార్హపత్యాగ్నినుండి గ్రహింపఁ
బడుట నాహవనీయమై ప్రాణంబు పిలువఁబడును॥ 4

ఇందు శరీరము యజ్ఞభూమిగను ప్రాణములు యజ్ఞవహ్నులుగను ఆరోపింపఁబడెను. వ్యానవాయువు దక్షిణ రంధ్రముద్వారా హృదయము నుండి వెడలును గనుక దక్షిణాగ్నిగాఁ బోల్చఁబడినది. గార్హపత్యాగ్ని నుండి ఆహవనీయము గ్రహింపఁబడు నట్లు ప్రాణము నిద్రలో అపానము నుండి గ్రహింపఁబడును గాన రెంటికి సామ్యము.

తే. గీ. శ్వాసనిశ్వాస లాహుతుల్ సమత నడపు
న దగుట సమానము, హృదయము యజమానుఁ
డింక యాగఫలము దాన మగును; నిదియె
బ్రహ్మఁ బొందించు యజమానుఁ బ్రతిదినంబు. 5

యజ్ఞాగ్నియందు హోమము చేయఁబడిన ఆహుతులు యజమానునికి యజ్ఞఫలము నిచ్చుచు స్వర్గము పొందించునట్లు సమానవాయువు ఉదానవాయువుచు గలిగించుచు బ్రహ్మను బొందించు నని భావము.

తే. గీ. మన సనెడు దేవుఁడు కలలో మహిమ గనును
మును గనినది గన్నదె కనున్, వినినది వినిన
దె విను, నన్యభూముల నన్యదిక్కులందు
**అనుభవించినదే మరల ననుభవించు.** 6

ఇంద్రియములు స్వప్నసమయమునందు మనస్సునందు లీనమై నప్పుడు అవిద్యకుఁ దాము అనుభవించిన విషయములనే తిరిగి కలలో జూచినట్లు వినినట్లు అనుభవించినట్లును అవిద్య చేఁ దోఁచు నని భావము.

దృష్టం చాదృష్టం చ శ్రుతం చాశ్రుతం చానుభూతం
చాననుభూతం చ సచ్చాసచ్చ సర్వం పశ్యతి సర్వః పశ్యతి. 7

ఈజన్మలోఁ జూచినదానిని చూడనిదానిని వినినదానిని వినని దానిని అనుభవించినదానిని అనుభవింపనిదానిని నీరు వలెఁ దోచు ఎండమావులు మొదలగు అసత్యమైన వానిని అన్నిటిని మనోదేవు లందఱు చూతురు.

స యదా తేజసాఽభిభూతో భవతి అత్రైష దేవః స్వప్నాన్
నపశ్యత్యథ తదైతస్మిన్ శరీర ఏతత్సుఖం భవతి. 8

ఆ మనోరూపదేవుఁడు నాడియందున్న పిత్తమను తేజస్సుచే వాసనాద్వారములను గూర్చి తిరస్కరింపఁ బడినపుడు స్వప్నములను చూడఁడు. నిద్రించును. అపుడు శరీరమందు బాధలేని నిద్రా సుఖమును బొందును.

పృథివీ పృథివీ మాత్రా చ, అపశ్చ ఆపోమాత్రా చ, తేజశ్చ
తేజోమాత్రా చ, వాయుశ్చ వాయుమాత్రా చ ఆకాశశ్చ ఆకాశ
మాత్రా చ, చక్షుశ్చ ద్రష్టవ్యం చ, శ్రోత్రం చ శ్రోత్రవ్యం చ,
ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ
రసశ్చ రసయితవ్యం చ, త్వక్చ స్పర్శయితవ్యం చ,
వాక్చ వక్తవ్యంచ,
హస్తౌ చాఽఽదాతవ్యం చ, ఉపస్థశ్చాఽఽనందయితవ్యం చ,
పాయుశ్చ విసర్జయితవ్యం చ, పాదా గంతవ్యం చ, మనశ్చ
మంతవ్యం చ
బుద్ధిచ్చ బోద్ధవ్యం, చాహంకార శ్చాహం కర్తవ్యం చ,
చిత్తంచ చేతయితవ్యంచ,
తేజశ్చ విద్యోత యితవ్యం చ, ప్రాణశ్చ విధారయితవ్యంచ,

కం. కనినది కననిది, విసినది
వినని, దనుభవించిన యది వెనుక ననుభవిం
పనిది సదసత్తు, లదియిది
యన నేటికి నన్ని సర్వ మాామనసె గనున్. 7

కననిది విననిది యనుభవింపనిది అనఁగా ఈ జన్మములోపల నని భావము. కాన జన్మాంతరమందుఁ గనినవానిని జూచును. జన్మాంతరమందుఁ గనుకున్నచో దానికి సంబంధించిన వాసనయే పుట్టదు. సత్తు= నీరు. మొ. అసత్తు నీరువలె దోచు ఎండమావులు. మొ.

తే. గీ. వాసనాద్వారములు, నాడిఁ బరఁగుతేజ
మునఁ దిరస్కృతము లగుట మనసుదేవుఁ
డెపుడుఁ గలలఁ గాంచఁడు మఱి యీశరీర
మవుడు బాధలేని సుఖంబు ననుభవించు. 8

పూర్వమం దనుభవించిన వానిని ఇప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చు వాసనా ద్వారములు మూయఁబడుటచేఁ గలలురాక నిద్ర వచ్చునని భావము.

సీ. భూమి భూమికి గుణమై మించు గంధంబు
నీరు నీటికి గుణమౌ రసంబు
ఆ తేజు తేజోగుణాఢ్యమౌ రూపంబు
వాయువు తద్గుణం బైన స్పర్శ
ఆకాశ మాకాశమం దున్న శబ్దమున్
నయనంబు కన్గోసం దగినయదియు
చెవి వినఁ జునది నాసిక మూర్కొనఁదగిన
యది, నాల్క రుచిమూడఁగఁ దగినదియు

భూమియు భూగుణమైన వాసన, నీరు నీటి గుణమగా రసమును తేజస్సు తేజోగుణమగా రూపము గాలి గాలి గుణమగా స్పర్శయు, ఆకాశము ఆకాశగుణమగా శబ్దమును, కన్నును జూడందగినదియు, చెవి వినందగినదియు, ముక్కును వాసన చూడందగినదియు, నాల్కయు రుచి చూడందగినదియు, చర్మము స్పృశింపందగినదియు, వాక్కు పల్కందగినదియు, చేతులు స్వీకరింపం దగినదియు, మర్మేంద్రియము ఆనందింపందగినదియు, గుదము విడువందగినదియు, కాళ్ళు నడవందగినదియు, మనస్సు తలంపదగినదియు, బుద్ధి బోధింపందగినదియు, అహంకారము నేను అనునదియు, చిత్తము తెలియందగినదియు, తేజస్సు ప్రకాశింపందగినదియు, ప్రాణము ధరింపందగినదియు ఇవి యన్నియు నాత్మయందుండును.

ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః। సపరేఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే. 10

ఇతండె చూచువాండు తాకువాండు వినువాండు వాసన చూచువాండు రుచిచూచువాండు మననము చేయువాండు బోధించువాండు చేయువాండు తెలిసికొను పురుషుండు. అతండు అక్షర మగు పరమాత్మయందుండెను.

పరమే వాక్షరం ప్రతిపద్యతే స యో హ వైత దచ్ఛాయ
మశరీర మలోహితం శుభ్రి మక్షరం వేదయతే యస్తు సోమ్య।
స సర్వజ్ఞః సర్వో భవతి తదేష శ్లోకః. 11

ఓయి సౌమ్యా! అక్షరుండైన పరమాత్మను బొందువాండును, తమస్సు లేని నామరూపాది శరీరములు లేని ఎఱుపులేని స్వచ్ఛమైన యక్షరాత్మను

త్వక్కును స్పృశియింపఁ దగినది, వాక్కు వ
చింపఁదగినది, చేయియుఁ గొనఁదగి
నదియు నుపస్థ మానందింపఁ దగినది
పాయువు మఱి విడువఁ దగినయది
పదములు నడవఁదగ్గది, మనస్సు మననం
బొనరింపఁ దగినది బుద్ధి తెలియఁ
గఁదగినదియు నహంకార మహంకరిం
పఁదగినదియుఁ జిత్త మట్టి
చైతన్యమును, మేనిచర్మ తేజము రూపు
ప్రాణంబును ధరియింపఁ దగినదియు

తే. గీ. అనఁగ నొప్పెడి యివ్వి యన్నిగూడ
నెవుడుఁ బరమాత్మయం దాశ్రయించి యుండు
సౌమ్య! తమకు వాసమగు వృక్షంబు పయిని
పక్షులవి యాశ్రయించియు వదల నట్లు. 9

మధు. ఇతఁడె దర్శించువాఁడు స్పృశించువాఁడు వినువాఁడు
వాసనను జూచువాఁడు నాస్వాదించువాఁడు మనన
మొనరిచెడువాఁడు బోధన మొనరించువాఁడు చేయు
వాఁడు, విజ్ఞాని, పురుషుండు వీఁడక్షరాత్మ నుండు. 10

జలములోపలి సూర్యునినీడ సూర్యునియం దున్నట్లు ఈ పురుషుఁడు పరమాత్మయం దుండె నని భావము.

తే. గీ. ఎవ్వఁ డక్షరుఁ బరమాత్మ నెఱుఁగు సౌమ్య!
ఎవఁడు తమములేని శరీరమేని లేని
రంగులేని నిర్మల మక్షరంబు కాని
యాత్మ గనునొ వాఁడఖిలజ్ఞుఁ డఖిలుఁడగును.

తెలియువాఁడును సర్వమును తెలిసినవాఁడగును. సర్వ మగును ఇది దీనిని జెప్పు శ్లోకము.

విజ్ఞానాత్మా సహ దేవై శ్చ సర్వైః ప్రాణా భూతాని
సంప్రతిష్ఠంతి యత్ర। త దక్షరం వేదయతే యస్తు
సోమ్య స సర్వజ్ఞః సర్వ మేవాఽఽవివే శేతి. 12

సౌమ్యా! విజ్ఞానరూపమైన యాత్మయు అగ్ని మొదలగు సర్వ దేవతలతోఁ గూడిన నేత్రాది ప్రాణములును పంచభూతములును ఏ యక్షరునం దున్నవో యట్టి యక్షరుని దెలియువాఁడు సర్వజ్ఞుఁడై సర్వమును బ్రవేశించును.

ఇతి
చతుర్థః ప్రశ్నః

---

అథ
పంచమః ప్రశ్నః

అథ హైనం శైబ్యః సత్యకామః పప్రచ్ఛ, స యో హ వై
తద్భగవన్ మనుష్యేషు ప్రాయణాంత మోంకార మభిధ్యాయీత
కతమం వావ స తేన లోకం జయతీతి. 1

పిదప శిబివంశస్థుఁడైన సత్యకాముఁడు పిప్పలాదుని నిట్లడిగెను. "భగవానుఁడా! మనుష్యులలో నెవఁడు చనిపోవువఱకు ఓంకారమును ధ్యానించునో వాఁడా యోంకారముచే ఏలోకమును గెలుచును?

తస్మై సహోవాచ ఏత ద్వై సత్యకామ పరం చాపరంచ
బ్రహ్మ యదోంకారః తస్మా ద్విద్వా నేతే నై వాఽఽయతే
నైకతర మన్వేతి॥ 2

మొదట అవిద్యచే సర్వజ్ఞుఁడు గాక యుండు జీవుఁడు తాను విద్యచేత సర్వజ్ఞుఁడై సర్వస్వరూపుఁ డగు నని భావము.

ఆ. వె. జ్ఞానమైన యాత్మ జ్వలనాది దేవతల్
ప్రాణములును భూత పంచకమును
నెందుఁ గలవొ యట్టి యక్షరుఁ గనువాఁడు
సౌమ్య! సర్వ మెఱుఁగు సర్వమొందు. 12

జ్వలనాది దేవతలు=అగ్ని మొదలగు నధిదేవతలు.
ప్రాణములు=చక్షురాది ప్రాణములు.

ఇది నాల్గవ ప్రశ్నము

---

ఇంక
అయిదవ ప్రశ్నము

తే. గీ. శిబికులుఁడు సత్యకాముండు చేరి యతని
నడిగె నోమహాత్ముఁడ! జీవితాంత మవని
నరులలోన "ఓమ్" అనుచు ధ్యానంబు సేయు
నాతఁ డే లోకమును దానిచేత గెలుచు. 1

ఈ ఐదవ ప్రశ్నములో అపర బ్రహ్మమును పరబ్రహ్మమును బొందించుటలో సాధనమైన యోంకారోపాసన చెప్పఁబడుచున్నది.

తే. గీ. అనఁగ సత్యకాముని బిప్పలాదుఁ డనియె
"ఓయి సత్యకామ! మఱి యీ ఓమనఁ బర

అపుడు ఆసత్యకామునికిఁ బిప్పలాదుఁ డనియె. "ఓ సత్యకామా! ఈ యపరబ్రహ్మ మగు ప్రాణమును పరబ్రహ్మ మగు పరమాత్మ యును ఓంకారమె. కాన విద్వాంసుఁ డీయాధారమైన యోంకారము చేతనే పరాపర బ్రహ్మలలో నేదో యొకదానిని బొందును.

స యద్యేకమాత్ర మభిధ్యాయీత స తే నైవ సంవేదిత స్తూర్ణ మేవ
జగత్యా మభిసంపద్యతే, తమృచో మనుష్యలోక ముపనయంతే
స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంపన్నో మహిమాన
మనుభవతి. 3

అట్టి మనుష్యుఁడు ఓంకారములో అ ఉ మ్ అను విభాగ పూర్వకముగఁ గాక ఓం అని ఒకటే రూపమున ధ్యానించినచో దాని చేతనే బోధింపఁబడి వెంటనే జగతియందుఁ బుట్టును. వానిని ఋక్కులు మనుష్యలోకమును బొందించును. వాఁడు అక్కడ తపస్సుచేతను బ్రహ్మచర్యము చేతను శ్రద్ధతోడను గూడినవాఁడై గొప్ప మహిమను బొందును.

అథ యది ద్విమాత్రేణ మనసి సంపద్యతే సోఽంతరిక్షం
యజుర్భి రున్నీయతే సోమలోకం స సోమలోకే విభూతి మను
భూయ పునరావర్తతే. 4

మఱి రెండు మాత్రలు గలిగి నటుల ఓంకారమును మనస్సున ధ్యానించినచో ఆ మనుష్యుఁడు చనిపోయిన పిదప అంతరిక్షమును బొంది యజుస్సులచే చంద్రలోకము పొందింపఁబడి యిట నైశ్వర్య మనుభ వించి తిరిగి భూలోకమునకు వచ్చును.

యః పున రేతం త్రిమాత్రే ణోమిత్యే తే నైవాక్షరేణ పరంపురుష
మభిధ్యాయీత, స తేజసి సూర్యే సంపన్నః. 5

మపర మగు బ్రహ్మమె; ప్రణవధ్యానముననె
పరమొ యపరంబొ యేదొ విద్వాంసుఁ డొందు. 2

ప్రణవము = ఓంకారము. అపరబ్రహ్మ = ప్రాణము. పర బ్రహ్మ = పరమాత్ముఁడు.

తే. గీ. మనుజుఁ డోంకారమును నేకమాత్రముగానె
ధ్యానమొనరింప భువి నరుండై జనించు,
ఋక్కు లతనికి నరలోక మిచ్చుఁ; దపసు
చేత బ్రహ్మచర్యను శ్రద్ధఁ జెందు మహిమ. 3

జీవుఁడు ఓంకారములోని అ ఉ మ్ అను విభాగము దెలియక పోయినను ఏకమాత్రగా ధ్యానించినను మనుష్యుఁడై పుట్టి బ్రహ్మచర్యాదుల వలనఁ దిరిగి సరిగాఁ దెలిసికొని యన్నిటిఁ బొందు నని భావము. "పృథివ్యకార స ఋగ్వేదః" అను శ్రుతిని బట్టి ఋక్కులే మనుష్య లోకమును బొందించునని భావము.

తే. గీ. ఇల ద్విమాత్రగ ఓము జపించు నరుఁడు
అంతరిక్షము పొందియు యజుసు చేత
చంద్రలోకము గని యట సౌఖ్య మొంది
మనుజ లోకమునకు వచ్చి మరల బుట్టు. 4

ద్విమాత్రగ అనుచోట రెండవ మాత్రయైన ఉకారముగ అనియు అ ఉ అను రెండు మాత్రలుగ అనియు కొందరు వ్యాఖ్యానించిరి.

మధ్య. మఱి త్రిమాత్రగ నోంకారమను నక్షరమున నీశుఁ
దలఁచువాఁడు సూర్యజ్యోతిఁ గలిసి కూసమును బాము

యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై
స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే
బ్రహ్మలోకం స ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం పురిశయం
పురుష మీక్షతే త తదేతౌ శ్లోకౌ భవతః. 6

ఎవఁడైతే దీనిని అ ఉ మ్ అను మూఁడు మాత్రల విజ్ఞాన యుక్తముగ ఓమ్ అను నక్షరముచే సూర్యమండల మధ్యవర్తి యగు పరమ పురుషుని ధ్యానించునో వాఁడు తేజోరూపుఁడై సూర్యునియందుఁ గలియును. పిదప పాము కుబుసముచే విడువఁబడినట్లు పాపముచే విముక్తుఁడై సామములచేఁ బైకి బ్రహ్మలోకమునకుఁ దీసికొని పెళ్ళఁబడును. అతఁడు ఈజీవుని కంటెఁ బరుఁడై శరీరమందు నివసించు పరమ పురుషుని జూచును. ఈ రెండును ఈ యర్థమును జెప్పు శ్లోకములు.

తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా, అన్యోన్య సక్తాః
అనవిప్రయుక్తాః, క్రియాసు బాహ్యాభ్యంతర మధ్యమాసు.
సమ్యక్ ప్రయుక్తాసు నకంపతేజ్ఞః. 7

బ్రహ్మదృష్టి లేకుండ అ ఉ మ్ అను మూఁడు మాత్రలు పలికినచో నవి మృత్యువును గూర్చును. అట్లుగాక చక్కఁగా ధ్యానమునఁ బ్రయోగింపఁబడిన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు అ ఉ మ్ అను మాత్రలను ఒక దానితో నొకటి గలిపి ఏక బ్రహ్మ విషయమందే ప్రయోగింపఁ బడినచో విద్వాంసుఁడు చలనము పొందఁడు.

ఋగ్భి రేతం యజుర్భి రంతరిక్షం సామభిర్య త్తత్కవయో
వేదయంతే తమోంకారేణై వాఽఽయతనే నాఽన్వేతి విద్వా
న్య త్తచ్ఛాంత మజర మమృత మభయం పరం చేతి. 8

వలెను బాపంబు విడుచు; సామలచేత బ్రహ్మలోక
మొంది, జీవికందని మేన నుండు పూరుషుని గనును.

అ ఉ మ్ అను మాత్రలను విజ్ఞానయుక్తముగా ఓంకారముచే ధ్యానించువాఁడు సూర్యునిఁ బొంది పాము కుబుసమును విడిచి క్రొత్త శరీరములోఁ బ్రవేశించునట్లు పాపముచే విడువఁ బడినవాఁడై పరిశుద్ధుఁడై సత్యస్వరూప మగు బ్రహ్మలోకమును బొందును. అపుడు సర్వ జీవులకు ఆత్మస్వరూపుఁడైన హిరణ్యగర్భుఁడు తనకంటెఁ బరుఁడై సర్వ శరీరములందుఁ బ్రవేశించి యేకమై యున్న పరమపురుషుని దర్శించి ముక్తుఁడగు నని భావము.

తే. గీ. ఇఁకఁ ద్రిమాత్రల్ విడిగఁ బల్క మృత్యు వొసఁగు
అవి యొకటిగఁ గూడి ప్రయుక్తమైన యెడల
జాగ్రత, సుషుప్తి, స్వప్నదశలను యోగి
సరిగఁ జేయు ధ్యానమునఁ జంచలతఁ గనఁడు. 6

జాగ్రత్పురుషుఁడు వైశ్వానరరూపుఁడైన విశ్వుఁడు, వాని స్థానము స్థూలశరీరము జాగ్రత్తయు, స్వప్నపురుషుఁడు హిరణ్యగర్భ రూపుఁడైన తైజసుఁడు వాని స్థానము లింగశరీరము స్వప్నమును, సుషుప్తిపురుషుఁడు ఈశ్వరరూపుడైన ప్రాజ్ఞుఁడు. వాని స్థానము అవ్యాకృతము. సుషుప్తియును వీనిలో అకారాదిరూపముఁగ ధ్యానించినచో జీవుఁడు చలింపఁడని భావము.

తే. గీ. ఋక్కు లిహమున్, యజుసు లంత రిక్షగతిని
సామలు కవులెఱుఁగు బ్రహ్మ జగముఁ గూర్చు
జ్ఞాని యోగముచే నివి యెల్లఁ గాంచి, మఱియు
శాంత మజరామృతాభయ స్థాన మొందు. 7

మనుష్యుఁడు ఋక్కులచేత ఈ లోకమును యజుస్సులచేత అంతరిక్షమును సామలచేతఁ గవులకుఁ దెలిసిన బ్రహ్మలోకమును బొందును. విద్వాంసుఁడు ఓంకారసాధనముచేత ఆ మూఁడు విధములైన లోకములను బొందును. మఱియు ఆ యోంకారముచేతనే శాంతమును జరామరణ రహితమును భయరహితమును నగు నిరతిశయ బ్రహ్మమును గూడఁ బొందును.

ఇతి

పంచమః ప్రశ్నః

---

అథ

షష్ఠః ప్రశ్నః

అథ హైనం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ, భగవన్ హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రో మా ముపేత్యైతం ప్రశ్న మపృచ్ఛత షోడశకలం భారద్వాజ పురుషం వేత్థ. 1

పిదప భరద్వాజవంశ్యుఁ డగు సుకేశుఁడు వచ్చి పిప్పలాదు నడిగెను. భగవానుఁడా! కోసలరాజపుత్రుఁ డగు హిరణ్యనాభుడు నా దగ్గఱకు వచ్చి "భరద్వాజ! నీవు షోడశకళలు గల పురుషుని నెఱుఁగుదువు చెప్పుము" అని యడిగెను.

త మహం కుమార మబ్రువం నాహ మిమం వేద, యద్యహ మిమ మవేదిషం కథం తే నావక్ష్య మితి, స మూలో వా

అజరము = ముసలితనములేనిది, అమృతము = మరణములేనిది, అభయము = సర్వభయశూన్యము. జ్ఞాని ఆ యోంకారముచేతనే సర్వలోకములను జరామరణాది రహితమైన శాంతపదవిని గాంచి ముక్తుఁడగునని భావము.

ఇది

ఐదవ ప్రశ్నము.

---

ఇంక

ఆఱవ ప్రశ్నము.

మధు॥ క్షితి భరద్వాజకులుఁడు సుకేశుఁ డిట్లడిగెఁ బిప్ప
లాదుని; మహాత్మ! కోసలరాజపుత్రుఁడు హిరణ్య
నాభుఁడే తెంచి ప్రశ్నించె నను "భరద్వాజపుత్ర!
షోడశకళలు గల పురుషుని నెఱుఁగుదువు చెప్పుమ" 1

షోడశకళలు = ప్రాణములు మొదలగు పదునాఱు కళలు. ఈ కళలు తరువాత పద్యములోఁ జెప్పఁబడును.

(చూ. ఈ ప్రశ్న ౬ పద్య)

మధు॥ అంత రాజపుత్రునితోఁ డనంటి "నా పురుషు నెఱుఁగ"
నెఱుఁగుదునయేని యేల వచింపను, ననృత మాడు

ఏష పరిశుష్యతి యోఽనృత మభివదతి తస్మాన్నార్హా
మ్యనృతంవక్తుం, స తూష్ణీꣳ రథమారుహ్య ప్రవవ్రాజ
తం త్వా పృచ్ఛామి క్వాసౌ పురుష ఇతి. 2

అపు డారాజకుమారునితో నిట్లంటిని. "దీనిని నే నెఱుఁగను. నాకుఁ దెలిసినచో నీకెందుకుఁ జెప్పకుందును. అనృత మాడువాఁడు సమూలము నశించును. కనుక నేను అనృత మాడువాఁడను గాను" అని. అంతట ఆరాజు ఊరకుండి తన రథ మెక్కి వెడలిపోయెను. ఆ ప్రశ్నను నిన్ను నడుగుచున్నాను. "ఈ పురుషు డెక్కడున్నాఁడో చెప్పుము."

తస్మై స హోవాచ, ఇహైవాంతశ్శరీరే సౌమ్య స పురుషో
యస్మిన్నేతాః షోడశకలాః ప్రభవంతీతి. 3

అను కేశునికిఁ బిప్పలాదుఁ డిట్లనియె. ఓసౌమ్యుఁడా! ఏహృదయ మందు ఈ ముందు చెప్పఁబోవు పదునారు కళలు పుట్టుచున్నవో యట్టి యీ హృదయ పద్మాకాశమందె ఆ పురుషుఁడు తెలియఁ దగినవాఁడై యున్నాఁడు.

స ఈక్షాంచక్రే, కస్మిన్నహ ముత్క్రాంత ఉత్క్రాంతో
భవిష్యామి కస్మిన్వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామీతి॥ 4

ఏది శరీరము నుండి వెడలిపోఁగా నేను శరీరము నుండి వెడలి పోవుదును. ఏది యుండఁగా నేను నిలచియుందు నని యాపరమాత్మ యాలోచించెను.

స ప్రాణ మసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖం వాయుర్జ్యోతి రాపః
పృథివీంద్రియం మనోఽన్న మన్నాద్వీర్యం తపో మంత్రాః
కర్మ లోకా లోకేషు నామ చ॥ 5

మనుజుఁడు సమూలము నశించు, నన్నృత మాడ, నన రథము
నెక్కి యూరకచనెఁ "జెప్పు మీ పురుషుఁ డెటఁగలఁడో"॥ 2

సమస్త కార్య కారణ రూపమైన యీ జగత్తంతయు జీవాత్మ
తో పాటు సుషుప్తి కాలమందుఁ బరమాత్మయందు లీనమై యున్న
దని చెప్పఁబడినది దీనిని బట్టియె ప్రళయకాలమందును సమస్తజగత్తు
ఆ పరమాత్మయందె యుండి ఆపరమాత్మ నుండి పుట్టుచున్నదని సిద్ధించు
చున్నది. కారణము లేకుండఁ గార్యము సిద్ధింపదుగదా. ఇంక ఇపుడా
పరమాత్మను ఎక్కడ దెలిసికొనవలెనో చెప్పవలసి యున్నది కాన
అందుకై ఈప్రశ్న మారంభింపఁబడుచున్నది.

కం. పిదప ననెఁ బిప్పలాదుఁడు
పదు నాఱుకళలు గలిగిన పరమపురుషుఁ డీ
హృదయాంతరాళమందునె
సదా నివాసంబుచేయు సౌమ్యా కనుమీ. 3

పురుషుఁడు = హృదయపురమందు శయనించువాడు.

కం. తనువందుండి యెది లే
చిన లేచిన వాఁడ నౌదు స్థిరముగ నెది ని
ల్చిన నిల్చిన వాఁడ నగుదు
నని యాపరమపురుషుండె యాలోచించెన్. 4

మధు॥ అంత నతఁడు ప్రాణము గూర్చెఁ బ్రాణాన శ్రద్ధ, శ్రద్ధ
నాకసము, గాలి, జ్యోతి, నీ, రవని, నింద్రియములు మనసు
నన్న, మన్నంబు నుండి వీర్యమును, దపస్సు, మంత్ర
కర్మములు, లోకములును లోకమున నామములు గూర్చె॥ 5

అతడు ఇట్లు ఆలోచించి ప్రాణమును సృజించెను. ప్రాణము నుండి శ్రద్ధను సృజించెను. ఆ శ్రద్ధ నుండి ఆకాశము, గాలి, జ్యోతిస్సు, నీరు, భూమి, ఇంద్రియములు మనస్సు అన్నము గలిగెను. ఆ యన్నము నుండి వీర్యము తపస్సు మంత్రములు కర్మ లోకములు గలిగెను. లోకములందు పేర్లును గలిగెను.

స యథేమా నద్యః స్యందమానాః సముద్రాయణాః సముద్రం
ప్రాప్యాస్తం గచ్ఛంతి భిద్యేతే తాసాం నామరూపే సముద్ర
ఇత్యేవ ప్రోచ్యతే ఏవ మేవాస్య పరిద్రష్టు రిమాః షోడశకళాః
పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి భిద్యేతే తాసాం
నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో
భవతి తదేష శ్లోకః॥ 6

అదెట్లనగా ఈ నదులు ప్రవహించుచు సముద్రమువైపు పోయి సముద్రమును బొంది యణగిపోవుచున్నవి. అవి సముద్రమనియె చెప్పఁబడును. ఇట్లే యీ ద్రష్టయైన జీవుని ఆ పదునాఱు కళలును పురుషుని వైపు పోవుచుఁ బురుషుని జేరి యస్తమించుచున్నవి. వాని నామరూపములు పోవుచున్నవి. వాఁడు పురుషుఁ డనియె చెప్పఁబడును. ఈపురుషుఁడు కళలు లేనివాఁడు మరణము లేనివాఁడు నగుచున్నాఁడు. ఇది యీ యర్థమును జెప్పు శ్లోకము.

అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః
తం వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః పరివ్యథా ఇతి. 7

బండి నాభియందు ఆకులవలె ఎవనియందు ఈ పదునాఱు కళలు ఉన్నవో యట్టి తెలియఁదగిన పురుషుని దెలిసికొనవలెను. మిమ్ము మృత్యువు బాధింపక పోవుఁగాక.

తాన్ హోవాచైతావదేవాహ మేతత్ పరం
బ్రహ్మ వేద నాతః పరమస్తీతి॥ 8

అట్లని మరల "ఇంతే నేను బ్రహ్మను గూర్చి తెలిసికొన్నది. ఇంతకంటె గొప్పది తెలియఁదగినది లేదు" అని వారిని గూర్చి పిప్పలాదుఁ డనెను.

శరీరము నుండి ప్రాణము లేచినచో జీవుఁడు లేచును నిల్చిన నిల్చును అని యాలోచించి ప్రాణమును సృజించి దాని నుండి శ్రద్ధ మొదలగు వానిని పరమాత్మ సృజించె నని భావము. ప్రాణము మొదలగు నామము వఱకు గల పదునాఱింటిని గళలందురు.

సీ॥ నదులెల్లఁ బాఱుచున్ సంద్రముపై వేగి
యాసంద్రమును జేరి యందె యణఁగు
అంతట నవ్వాని యాకారములు పేర్లు
నశియించి సంద్ర మనంగఁ బడును
అటులె యీదార్ష్టయే ప్రాణి షోడశకళ
లా పురుషుని జేరి యందె యణఁగు
అంతట నవ్వాని యాకారములు పేర్లు
నశియించి పురుషుఁ డనంగఁ బడును

తే. గీ. మఱి యవిద్యాది కామకర్మల జనించు
సకల ప్రాణాది కళలును సక్రమముగ
విద్యచే నాశ మొందఁగ విమలరీతి
వీఁడు నిష్కలుఁ డమృతుఁడై వెలయుచుండు. 6

తే. గీ. బండినాభి నాకులు వరలు నట్లు
ఎవనిలోన నీకళ లెల్ల నెపుడు నుండు
నట్టి తెలియఁ దగు పురుషు నరయవలెను
మిమ్ము బాధింపకుండుట మృత్యు వెపుడు. 7

తే తమర్చయంత స్త్వం హి నః పితా యోఽస్మాక మవిద్యాయాః
పరం పారం తారయ సీతి నమః పరమ ఋషిభ్యో
నమః పరమ ఋషిభ్యః 9

పిదప ఆ శిష్యులు ఆ పిప్పలాదుని బూజించి యిట్లనిరి. "నీవే మాకుఁ దండ్రివి, నీవే మమ్ము అవిద్య నుండి యవతలి యొడ్డుకు దాటించితివి పరమ ఋషులకు నమస్కారము, పరమ పురుషులకు నమస్కారము.

శాంతి మంత్రః

ఓమ్. భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యే
మాక్షభి ర్యజత్రాః, స్థిరై రంగై స్తుష్టువాంస
స్తనూభిః వ్యశేమ దేవ హితం యదాయుః

దేవతలమగుచు మేము చెవులచే శుభము విందుము గాక. యజ్ఞశీలురమైన మేము కన్నులచే శుభమును జూతుముగాక, స్థిరమైన యంగములతో శరీరము లనెడి మంత్రములతో మిమ్ము స్తుతించుచు దేవులు ప్రసాదించిన దీర్ఘాయువును బొందుదుము గాక.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతుః.

బృహస్పతి మొదలగు పెద్దలయొద్ద వినెడి యింద్రుఁడు మాకు శుభము గలుగఁజేయుఁగాక, సర్వమును దెలిసిన సూర్యుఁడు మాకు శుభ మిచ్చుఁగాక, అహింసాపాలకుఁడైన గరుత్మంతుఁడు మాకు శుభ మిచ్చుఁగాక.

ఓమ్

శాంతిః శ్శాంతిః శ్శాంతిః
ఇతి అథర్వ వేదాంతర్గతాయాం
ప్రశ్నోపనిషది షష్ఠః ప్రశ్నః
ప్రశ్నోపనిషత్ సమాప్తా.

కం. అని చెప్పి పిప్పలాదుం
డనె వారలతోడ నింతియ పరబ్రహ్మం
బును గూర్చి నే నెఱిఁగినది
యనుకొందు నింకఁ దెలియఁదగు నది లేదనియున్. 8

(దీనికి మూలము 147 పుట మొదట చూడవలెను)

తే. గీ. అంతఁ బిప్పలాదు భజించి యనిరి వారు
తండ్రి వీవు మాకు; నవిద్యనుండి కరుణ
మముఁ దరింపఁ జేసితివి; బ్రహ్మర్షులకును
వందనము, బ్రహ్మఋషులకు వందనంబు. 9

శాంతి మంత్రము, దండకము.

చెవులచే భద్రముల్ విందు మాదైవ భావంబులన్ బొందుచున్
గన్నులన్ భద్రముల్ చూతు మాయజ్ఞ శీలంబుతో నిశ్చ
లంబైన యంగంబులన్ దేహమంత్రాలతో స్తోత్రముల్ చేతు మెల్లప్డు
దేవుల్ ప్రసాదించు దీర్ఘాయువుల్ గల్గుతన్ మాకిలన్॥
మాకున్ శుభం బిచ్చుతన్ పెద్దన్ భక్తి నాలించు నింద్రుండు
మాకున్ శుభం బిచ్చుతన్ సర్వవేదుండు సూర్యుండు
మాకు న్నహింసా పథుం డౌ గరుత్మంతుఁ డిచ్చున్
శుభంబుల్ సురాచార్యుఁ డిచ్చున్ శుభంబుల్ సదా॥



ఇది శ్రీ చర్ల నారాయణశాస్త్రి జనక గురువర కరుణాలబ్ధ
విద్యుఁడును వెంకమాంబా పుత్రుఁడు నగు గణపతి
శాస్త్రిచేఁ దెనిఁగింపఁ బడిన యుపనిషత్సుధ
యందు ఆఱవ ప్రశ్నము.

ప్రశ్నోపనిషత్తు.

సమాప్తము.

---

రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్, కాకినాడ.